# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''క్షత్రియ ధర్మం"] గంగిశెట్టి శివకుమార్ రచన. మానవధర్మం అంటూ ఒకటి ఉంటుంది. కాని వర్గధర్మాలు వేరు వేరుగా ఉంటాయి. రెంటికీ ఘర్షణ రావచ్చు. అలాగే క్షత్రియధర్మం ఒక రకంగా ఉంటే, వ్యక్తులు పాటించే ధర్మాలు వేరుగా ఉండటం వల్ల, ఆ ధర్మాలకూ దానికీ ఘర్షణ రావచ్చు. ఈ ఘర్షణ వల్ల వ్యక్తులు వింతగా ప్రవర్తిస్తారు. బేతాళకథలో మనకు ఇదే కనబడుతుంది.

సంపుటి 57 అక్టోబర్ '75 సంచిక 4




CHITRA



# మిత్రభేదం

## 28

దుష్టబుద్ధికి అతని తండ్రి కొక్కిరాయి కథ చెప్పి, ''వివేకం గలవాడు ఏదన్నా పథకం ఆలోచించి నప్పుడు అందులో ఉండే దోషాలు గ్రహింపు చేసుకోవాలి. నీ పథకంలో నాకు అనేక లొసుగులు కనిపిస్తున్నాయి,'' అన్నాడు.

దానికి దుష్టబుద్ధి తన తండ్రితో, ''లేదు, లేదు. ఇది మంచి పథకమే. ఏ పథకంలోనైనా ఏదో లోపం ఉండక పోదు. నువు నేను చెప్పినట్టు చెయ్యక పోయావో వృక్షదేవత సాక్ష్యం పలకదు. అబద్ధమాడానని న్యాయాధిపతులు నా తల కాస్తా తీసేస్తారు. అందుచేత, నాన్నా, నువు నా ఆలోచనకు సమ్మతించాలి. దానితో మనిద్దరమూ క్షేమంగా బయటపడి, హాయిగా జీవిస్తాం.'' అన్నాడు.

ఎలాగైతే నేం, దుష్టబుద్ధి తన తండ్రిని ఒప్పించి, చెట్టుతొర్రలో ఎవరికీ కనపడటానికి వీలులేకుండా ఆయనను దాచాడు.

మర్నాడు ఉదయం దుష్టబుద్ధి స్నానం చేసి, అడవిలో చెట్టు దగ్గిరికి వెళ్ళాడు. అక్కడికి న్యాయాధికారులూ, ధర్మబుద్ధీ చేరారు. అందరూ వింటూండగా దుష్టబుద్ధి గొంతెత్తి, ''మనుష్యులు చేసేదంతా సూర్య చంద్రులకూ, నక్షత్రాలకూ, పంచభూతాలకూ, అంతరాత్మకూ, మృత్యువుకూ, రాత్రి పగళ్ళకూ, ఉభయ సంధ్యలకూ, వృక్షదేవతలకూ తెలుసును. కనక, ఓ వృక్షదేవతా, మా ఇద్దరిలో దొంగ ఎవరో చెప్పు!'' అన్నాడు.

అతని తండ్రి చెట్టు తొర్రలో నుంచి, ''బంగారం అపహరించిన వాడు ధర్మబుద్ధి,'' అని పలికాడు.

---

అట్ట చివరి బొమ్మ

ఈ మాట విని ధర్మబుద్ధి, ''వృక్ష దేవత సాక్ష్యం పలకటమేమిటీ? ఎక్కడా లేని సంగతే! పైగా ఆ పలికేది నిజంగా దేవత అయి ఉండదు. దేవతలు నిజం తప్ప పలకరు. ఇందులో ఏదో మోసం ఉన్నది. బుద్ధిమంతుడికి మోసం తెలిసి తీరుతుంది. చెట్టు తొర్రలో దుష్టబుద్ధి ఎవరినో దాచి ఉంటాడు. ఈ దొంగ దేవతకు సరి అయిన విధంగా బుద్ధి చెబుతాను. నేను చాలా జాగ్రత్తగా మసలాలి. ఎందుకంటే న్యాయాధికారులు మూఢులు. నేను దోషినని వారికి నమ్మకం కుదిరింది,'' అనుకున్నాడు.

అతను న్యాయాధికారులతో, ''అయ్యలారా, ఈ వృక్షదేవత నిజం తెలుసుకోవటమూ, దానిని చెప్పటమూ నిజంగా అద్భుతమైన సంగతి. నా పేరు ధర్మబుద్ధేనసుకోండి. నాకు నిజంగా డబ్బు అవసరం లేకపోయినా, క్షణికమైన దౌర్బల్యం కారణంగా నేనిక్కడికి ఒంటరిగా వచ్చి, బంగారం తీసుకున్నాను. నేను డబ్బు తీసుకోబోతూ ఉండగా ఒక భయంకరమైన పాము ప్రత్యక్షమయింది. అప్పుడు నాకు ఏమనిపించిందంటే: శకునం బాగాలేదు; పోయిన డబ్బు తిరిగి దొరకవచ్చుగాని, పోయిన ప్రాణం తిరిగి రాదు గద! పాము వెళ్ళిపోయాక మరో సారి వచ్చి డబ్బు తీసుకుపోదామనుకున్నాను. అలా అనుకుని బంగారాన్ని చెట్టు తొర్రలో దాచాను. దానికి రక్షగా



పాముకూడా తొర్రలో జొరబడింది. నేను మీకు బంగారం అప్పగించుతాను. ఎలా నైనా ఆ పామును చంపి బంగారం పైకి తీస్తాను. కొంచెం పక్కకు తొలిగారంటే పాముకు ఊదర పెడతాను,'' అన్నాడు.

న్యాయాధికారులు అందుకు సమ్మ తించారు. ధర్మబుద్ధి చెట్టుతొర్రలో ఎండు పుల్లలూ, ఎండు ఆకులూ కుక్కి, వాటికి నిప్పు పెట్టాడు.

దుష్టబుద్ధి పాలిపోయిన ముఖంతో, తల వంచుకుని నిలబడి, చెట్టు తొర్రలో ఉన్న తన తండ్రికి ఏం మూడుతుందో, నిజం బయటపడితే తన గతి ఏమవు తుందో అని బెంగపడసాగాడు.

త్వరలోనే మంటలూ, పొగా తొర్రలోకి ఎక్కాయి. కొద్ది సేపటి కల్లా దుష్టబుద్ధి తండ్రి, ఒళ్ళు సగం కాలి, కళ్ళు రెండూ పోయి, ఆర్తనాదాలు చేస్తూ బయటికి దొర్లాడు.

న్యాయాధికారులు ఆయనను, ''ఏమి టిది?'' అని అడిగారు.

''నా కొడుకు దుష్టబుద్ధి చేసిన దుస్తంత్రం,'' అంటూ ఆయన జరిగిన దంతా చెప్పి, ప్రాణాలు వదిలాడు.

న్యాయాధికారులు దుష్టబుద్ధిని ఆ చెట్టు కొమ్మకే ఉరితీసి, ధర్మబుద్ధిని ప్రశం సించారు.

కరటకం దమనకానికి దుష్టబుద్ధి కథ చెప్పి, ''మూర్ఖుడా, అనాలోచనగా చేసిన ఈ పనివల్ల నీకు నువే హాని తెచ్చుకోవట మేగాక, నాతో సహా మన కుటుంబాని కంతకూ ప్రమాదం తెచ్చావు. మూర్ఖుల లక్షణమే అది. నదులు ఉప్పుసముద్రం పాలవుతాయి. పోట్లాడుకునే స్త్రీలు కుటుంబాన్ని చీల్చుతారు. అలాగే నీ స్వభావాన్నిబట్టి నువు పింగళకానికీ, సంజీవకానికీ మధ్య స్పర్ధతెచ్చిపెట్టావు. నువు ఎంత మూర్ఖుడివంటే ఎలుకలు ఇనుముతిన్నకథను కూడా నమ్మవచ్చు," అన్నది.

''ఏమిటా కథ?'' అని దమనకం అడిగింది. కరటకం ఇలా చెప్పింది :





## 16

[రాక్షసుడు, రాకుమార్తెలు ముగ్గురినీ మూగవాళ్ళుగా చేసి అరణ్యంలో వదిలాడు. మాళవ దేశపురాజు వాళ్ళను రక్షించి, తన భవనానికి తీసుకుపోయాడు. ఉదయనుడు, మారు వేషంతో రాక్షసుడి సేవకులుండేచోట చేరాడు. అక్కడికి అర్ధరాత్రి సమయంలో రాక్షసుడు వచ్చి, సింహాలను చంపినదెవరంటూ, ఉదయనుడి కేసి రాసాగాడు. తరవాత—]

రాక్షసుడు పెడబొబ్బలు పెడుతూ, తన దగ్గరకు రావటంచూస్తూనే, ఉదయనుడు భయంతో గజగజలాడిపోయాడు. అతడు ఏదో జవాబు చెబుదామనుకునేంతలో, రాక్షసుడి పరిచారకులంతా పరుగుపరుగున అక్కడికి వచ్చారు.

వాళ్ళల్లో సింహాలను చంపినవాడు చేతులు కట్టుకుని, "నేనే, బాబయ్యా, యీ పని చేసింది. మన భవనంలో వుంటూ, మన చేతికింద పెరుగుతూ అవి మనల్నే మాటువెయ్యచూశాయండి. నేనే గనక సమయానికి అదుకోకపోయినట్టయితే, ఈ పాటికి పాపం, వాడు యమలోకానికి పోయేవాడే!" అని రాక్షసుడికి విన్నవించుకున్నాడు.

అందుకు రాక్షసుడు, "ఆఁ, అలాగా! మాంచిపని చేశావు. ఈ సింహాలకు కొంచెం కొవ్వెక్కినట్టుంది. తక్కినవాటికి ఒక



వారం రోజులపాటు కడుపు ఎండకట్టండి. అవే దారికొస్తాయి,'' అంటూ అక్కడి నుంచి చరచరా వెళ్ళిపోయాడు.

అప్పటికిగాని ఉదయనుడికి ప్రాణాలు కుదుటపడలేదు. ఏమీ ఎరగనట్టు పడుకున్నాడే కాని, రాక్షసుడు ఎటు పోయిందీ, ఒక కంట కనిపెడుతూనే వున్నాడు ఉదయనుడు.

రాక్షసుడు చావడి చివర ఒక పెద్ద ద్వారం వద్దకు వెళ్ళి, మొలలో నుంచి ఒక చిన్న తాళపుచెవి తీసి, ఏదో మంత్రం చదివాడు. మంత్రం చదవటం పూర్తయేసరికి, ఆ చిన్న తాళపుచెవి కాస్తా ఏడడుగుల పొడవున పెరిగిపోయింది. అప్పుడు రాక్షసుడు దానితో, ఆ ద్వారం తలుపులు తెరిచి లోపలప్రవేశించాడు.

ఉదయనుడు ఆ లోపల ఏమున్నదో లేచి వెళ్ళి చూద్దామనుకున్నాడు. కాని, పట్టుపడిపోతే ప్రాణాలు దక్కవే? అందుకని ఏమి జరిగేదీ జాగ్రత్తగా కనిపెడుతూ, అలానే పడుకుండి పోయాడు.

మరి కాసేపటికల్లా రాక్షసుడు బయటికి వచ్చి, యథాప్రకారం తలుపు మూసివేశాడు. మళ్ళీ మంత్రం ఉచ్చరించేసరికి, తాళపుచెవి తిరిగి చిన్నదయిపోయింది. అది బొడ్డులోదోపుకొని, రాక్షసుడు పాతాళ గృహం లోంచి బయటికి వెళ్ళిపోయాడు.

మిగతా పరివారం తిరిగి ఎవరి చోట్లకు వారు వెళ్ళి, గుర్రుకొట్టి నిద్రపోసాగారు. ఈ అదునులో ఉదయనుడు మెల్లగాలేచి, రాక్షసుడు తెరిచి, మూసిన పెద్ద ద్వారం వద్దకు వెళ్ళాడు. తాళపుచెవి దూర్చే బెజ్జంలోనుంచి తొంగి చూశాడు. చూడగా ఉదయనుడు తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. ఎందుచేతనంటే, తను ఎవరికోసమైతే తపించిపోతున్నాడో, ఆ గడ్డపువాడు అక్కడ తలక్రిందుగా వ్రేలాడ తీయబడివున్నాడు. సంధ్యా నిశీధులు మాత్రం లేరు.

ఇది చూసేసరికి ఉదయనుడికి భయమూ, ఆశ్చర్యమూ కలిగినై. తన




సోదరులేమైనట్లు? గడ్డపువాడిని కలుసు కుంటే తెలుస్తుందేమో! కాని, తాళపు చెవి లేకుండా లోపల ప్రవేశించటం ఎలా? ఉదయనుడికి ఏమీ పాలుపోయిందికాదు.

అలాగే కొంతసేపు ద్వారం వద్ద నిలబడి, ఎంతకూ ఏమీ తోచక, ఉదయనుడు విసిగి విసిగి, తన చోటుకువచ్చి పడుకున్నాడు. పడుకున్నాడేకాని నిద్ర పట్టితేనా? ఆ గదిలో ప్రవేశించటం ఎలాగ? గడ్డపువాడిని కలుసుకోవటం ఎలా? సోదరులు ఏమయారు? రాత్రంతా ఉదయనుడికి యిదే ఆలోచన.

తెల్లవారింది. రాత్రికాపలా కాసినజట్టు తిరిగి పాతాళగృహం చేరుకున్నారు. వాళ్ళు రావటంతోటే, యిక్కడవున్న కాపలావాళ్ళు కొలనుకు బయలుదేరి పోయారు. ఉదయనుడికి ఆ వచ్చిన వాళ్ళద్వారా, గడ్డపువాడు వేళ్ళాడుతున్న గదిని ప్రవేశించేమార్గం అడిగి తెలుసు కుందామా అన్న కోరిక కలిగింది. కాని, వెంటనే ఒక సందేహం కూడా కలిగింది. ఈ ప్రశ్న అడగ్గానే తన మారువేషం బయట పడుతుందేమో! తను పట్టుబడి పోతాడేమో! అందుచేత ఉదయనుడు, ఆ ఆలోచన అంతటితో కట్టిపెట్టివేశాడు.

ఒకవారం రోజులకల్లా రాక్షసుడు తిరిగివచ్చాడు. మునుపటిలాగానే మొలలో నుంచి తాళంచెవి తీసి, మంత్రం వేసి పెద్దదిచేశాడు. గది తలుపులు తెరిచి లోపల ప్రవేశించాడు. ఉదయనుడు కూడా, అతడితోపాటు యుక్తిగా వాకిలి దాటి లోపల అడుగుపెట్టాడు.

వాకిలికి పక్కగా మనిషి నిలువుకు సరిపడే మూడు పెద్దపెద్ద బానలూ, వాటి పైన మూతలూ వున్నై. మొదటిదాని పైనవున్న మూత తీశాడు, ఉదయనుడు. దానిలో ఎవరో మనిషి వున్నట్టు కనిపించింది. గబుక్కున మూసివేశాడు. రెండో బాన మూతతీసి చూశాడు. అందులోనూ అలాగే మనిషి కనిపించాడు. అదీ మూసి వేశాడు. మూడవ బాన చూశాడు. ఖాళీగా



వుంది. గుట్టుచప్పుడు కాకుండా, దానిలో దిగి మూత వేసేసుకు కూర్చున్నాడు. ఆ సమయంలో రాక్షసుడు ఎక్కడ వున్నదీ ఉదయనుడికి తెలియదు.

మరికాసేపటికి రాక్షసుడు ఆ బానల దగ్గరకు వచ్చాడు. 'ఒకటీ' అని అరుస్తూ, మొదటి బాన మీది మూత ఎత్తాడు. లోపలవున్న మనిషి లేచి నిలబడ్డాడు. రాక్షసుడు వాడిని జుట్టు పట్టుకుని బైటికి లాగాడు. తర్వాత 'రెండూ' అంటూ కేకపెట్టి, రెండో బాన మీది మూత ఎత్తాడు. దానిలోవున్న మనిషి కూడా లేచి నిలబడగా, వాణ్ణికూడా జుట్టు పట్టుకుని ఎత్తి బైటికిలాగాడు.

తరవాత రాక్షసుడు, వాళ్ళను వెంటబెట్టుకుని గది బయటికి వచ్చేశాడు. తలుపులు ఎప్పటిలా మూసి, తాళంచెవి మొలలో దోపుకున్నాడు. వాళ్ళనిద్దరినీ చెరో గుప్పెటలో పట్టుకుని, పాతాళగృహం లోంచి బయటికి వెళ్ళిపోయాడు.

ఉదయనుడు ఏ మాత్రం ఆలశ్యం చెయ్యలేదు. వెంటనే బాన మూత ఎత్తి పైకి రాబోయాడు. కాని దిగటమంత తేలికగా కనబడలేదు, పైకిరావటం. ఒక్క ఎగురు ఎగిరాడు. పైకంటా ఎగరలేక పోయాడు. బాన అంచు కాలికి తగిలి, దానితోసహా కిందబడ్డాడు. పడీపడటంతోటే బాన ముక్కముక్కలై పోయింది.

ఇలా ఉదయనుడు బైటపడ్డాడు. మరి కొద్ది దూరంలోనే వేలాడుతున్న గడ్డపువాడు కనిపించగా, ఒక్కపరుగున వాడి దగ్గరకు వెళ్ళాడు, ఉదయనుడు. "ఇదేమిటయ్యా, ఈ శిక్ష? నా సోదరులు ఏమైనారు? చెప్పు. రాక్షసుడు రాక ముందే నేను పోవాలి. చెప్పు, త్వరగా చెప్పు!" అని, గడ్డపువాణ్ణి తొందర పెట్టాడు ఉదయనుడు.

ఉదయనుడు మారువేషంతో వచ్చాడని, గడ్డపువాడు యిట్టే గ్రహించాడు. వాడు వెంటనే, "నువ్వేనటోయ్! గాభరా

పడకు. వాడు యింకో వారం రోజుల వరకూ రాడులే. ముందు నా కట్లువిప్పు చెబుతా,'' అన్నాడు.

ఉదయనుడు, గడ్డపువాడి కట్లు విప్పాడు. బంధాలు పోగానే గడ్డపువాడు యిలా చెప్పాడు: ''నువ్వు యీ లోపలకు రావటం, బానల మీది మూతలు తీసి చూడటం—అంతా నేను గమనిస్తూనే వున్నాను. ఆ రెండు బానలలోనూ నీవు చూచిన మనుషులు ఎవరనుకున్నావు? వాళ్ళే నీ సోదరులు. ఇంకానయం, వాడు మూడో బాన మీది మూత తియ్యలేదు. తీసినట్టయితే, నీ గతి ఏమయ్యేదో!''

అంతా విని ఉదయనుడు ఆత్రంగా, ''ఏమిటీ, వాళ్ళు నా సోదరులా? సంధ్యా, నిశీధులా? ముందు వాళ్ళను విడిపిద్దాం పద,'' అంటూ గడ్డపువాణ్ణి వేగిరపెట్టాడు.

గడ్డపువాడు విరగబడి నవ్వుతూ, ''ఓరీ, పిచ్చితండ్రీ! వాళ్ళు యింకా వాటిలో వున్నారనుకొంటున్నావా? ఒకటీ, రెండూ అని, రాక్షసుడు పిలవటం వినిపించలేదా? వాళ్ళను ఆ బానల్లో నుంచి పైకిలాగి, తనతో తీసుకొని పోయాడు,'' అన్నాడు.

''సరేకాని, ముందు యీ సంగతి చెప్పు. వాడు, నిన్నెందుకిలా తల క్రిందులుగా వేళ్ళాడదీశాడు? ఎందుకోసమని, నా సోదరులను బానలలో పెట్టాడు? ఆనాడు మిమ్మల్ని యీ పాతాళ గృహం





లోకి తీసుకువచ్చిన తర్వాత, ఏం జరిగింది?" అని ప్రశ్నించాడు ఉదయనుడు.

"ముందు పగిలిన ఆ బాన ముక్కలు దాచేసెయ్యాలి. తర్వాత మిగతా విషయాలు చెబుతాను," అంటూ గడ్డపువాడు వెళ్ళి, ఆ ముక్కలన్నీ ఎత్తాడు. ఆ పని పూర్తిచేసి అతడు, ఉదయనుడితో, "నీవు ఎక్కడికి పోయిందీ, మాకు తెలిసివుండి కూడా, మేము దాస్తున్నామనీ, ఆ సంగతి వెల్లడించేవరకూ మమ్మల్ని నానాయాతనా పెడతాననీ, రాక్షసుడు బెదిరించాడు. అయితే మేము ఏమాత్రం సంగతి బయట పెట్టలేదు. అప్పుడువాడు, మా ముగ్గురినీ, ఆ మూడు బానలలోనూ పెట్టి బంధించాడు. అప్పటికీ నేను రహస్యం బయట పెట్టకపోయేసరికి, నన్ను యిలా వేలాడదీశాడు. అయినా నేను మొండిగా, నీ సంగతి నాకు ఏమీ తెలియనే తెలియదని చెబుతూవచ్చాను. నన్ను చేసినట్టుగానే, నీ సోదరులను కూడా వేలాడదీస్తాడనుకున్నాను. కాని, అలా చేసినట్టు కనబడదు. మరి ఎక్కడికి తీసుకుపోయాడో, నాకూ బోధపడటంలేదు," అన్నాడు.

తర్వాత ఉదయనుడు, తను ఎలా మాయవేషం వేసుకుని అక్కడికి చేరుకున్నదీ వివరంగా చెప్పి, భస్మాలూ, అంజనాలూ మొదలైనవి పోగొట్టుకున్న సంగతి కూడా చెప్పాడు.

అంతావిని గడ్డపువాడు, "వాటిని ముమ్మాటికీ ఆ రాజే కాజేసివుంటాడు. ఏదో ఒక ఉపాయంచేత యిక్కడినుంచి బైటపడి, మళ్ళీ ఆ రాజు దగ్గిరకుపోయి, వాటిని తిరిగి సంపాదించే మార్గం చూడాలి," అన్నాడు.

అదేప్రకారం గడ్డపువాడూ, ఉదయనుడూ కలిసి ఆలోచించసాగారు.

* * *

ఇక మాళవదేశ రాజైన ప్రతాపసింహుని కోటలోవున్న ముగ్గురు రాజకుమార్తెల విషయంలో ఒక చిత్రం జరిగింది. ఉదయనుడు ఆ రాజు దగ్గిర కొచ్చి,

మర్నాడు వెళ్ళిపోతాడనగా రాజు ఒక పథకం వేశాడు. ఉదయనుడు రాత్రివేళ గాఢనిద్రలోవుండగా, అతడి దగ్గిరవున్న భస్మాలనూ, అంజనాలనూ రాజు దొంగిలించి, ఏమీ ఎరగనట్టు పూరుకున్నాడు. మర్నాడు ఉదయనుడు వెళ్ళిపోగానే, రాజు తనే స్వయంగా రాకుమార్తెలను చేరబిలిచి, అంజనాలూ, భస్మాలూ ప్రయోగించి, వాళ్ళ అంగవైకల్యాలు పోగొట్టాడు. ఇప్పుడు వాళ్ళు ఏలోపం లేకుండా కనబడగానే, రాజు వాళ్ళ అందచందాలుచూసి తన్మయుడై పోయాడు.

రాజు ప్రతాపసింహుడు, కవలలను వివాహమాడదలిచి, ఆ మాట వాళ్ళకు చెప్పాడు. కాని, వాళ్ళు, అతణ్ణి వివాహం ఆడేందుకు అంగీకరించలేదు. రాజు, వాళ్ళను బెదిరించిచూశాడు. ప్రయోజనం లేకపోయింది. దానితో అతడు రాకుమార్తెలను కారాగారంలో పెట్టించాడు. అనుకోని విధంగా వచ్చిన యీ అవాంతరానికి, రాకుమార్తెలు దుఃఖంతో కుమిలిపోసాగారు.

ఇక భూగృహం నుంచి సంధ్యా నిశీధులను తీసుకుపోయిన రాక్షసుడు, వాళ్ళిద్దర్నీకొలను ఒడ్డున నిలబెట్టి, ''ఒరే, ఆఖరుసారిగా మీకు అవకాశం యిస్తున్నా. మీ సోదరుడు ఎక్కడికి పారిపోయాడో, యిప్పుడైనా నిజం చెప్పండి. లేకుంటే మరొకక్షణంలో, మీ పుచ్చెలు ఎగిరి



పోతై,'' అంటూ గండ్రగొడ్డళ్ళతో సిద్ధంగా వున్న భటులను చూపించాడు.

సంధ్యానిశీధులు ఒక్క క్షణం అలానే నిలుచుండి పోయారు. ముందుగా నిశీధుడు ధైర్యం తెచ్చుకుని, రాక్షసుడితో, ''అయ్యా, వాడు ఎక్కడికిపోయిందీ, మాకూ తెలియదు. కాని యిక్కడినుంచి బైటపడితే, ఎలాగో తిప్పలుపడి వాడిని వెతికి కలుసుకోగలమనే ఆశ, నాకున్నది. కనుక మా మాటమీద నమ్మకంవుంచి, మమ్మల్ని విడుదల చెయ్యి. త్వరలోనే, మా సోదరుడితో సహా తిరిగివస్తాము.'' అన్నాడు.

''ఓహో, బలేపాచిక వేశావే! నీ దొంగ వేషాలు నా దగ్గిర సాగవు. ఇదివరకు చేసిన మోసాలన్నీ మరిచాననుకున్నావా? నీ విక్కడికి తిరిగివస్తానని నమ్మకమేమిటి?'' అన్నాడు రాక్షసుడు.

అందుకు నిశీధుడు, సంధ్యని చూపుతూ, ''ఐతే వీడిని నీదగ్గిరే బంధించి వుంచుకో. నీ కోసం కాదనుకో, తోటి సోదరుని వదులుకోగలమనుకున్నావా? అతణ్ణి రక్షించుకోవటానికైనా, మేము తిరిగి నీ దగ్గిరకు రాక తప్పదుగదా?'' అన్నాడు.

''సరే. మరొకవిషయం. ముఖ్యంగా నేను, నీ సోదరుని పట్టాలంటున్నది ఎందుకో తెలుసా? ముఖ్యమైన భస్మాలూ, అంజనాలూ అతడి వద్ద వుండిపోయాయి. అవి అతడి వద్ద వున్నంతవరకూ, నాకు నిద్రపట్టదు. కనుక, అతనే రానక్కర లేదు. నీ వైనాసరే, ఆ భస్మాలూ అవీ తెచ్చి నాకు ఒప్పగిస్తేచాలు. ఏనాడైతే ఆ పని చేస్తావో, ఆ నాడే నీ సోదరునికూడా విడుదలచేసివేస్తాను, తెలిసిందా?'' అన్నాడు రాక్షసుడు.

సంధ్య కూడా యీ పద్ధతికి ఒప్పుకున్నాడు. నిశీధుడు బయలుదేరాడు. మిగతా హంసలతో పాటు, సంధ్యని కొలనులో వుంచమనిచెప్పి భటులకు ఒప్పగించి, రాక్షసుడు వెళ్ళిపోయాడు.

—(ఇంకావుంది)






# క్షత్రియధర్మం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ ప్రయత్నంలో నీకు అపజయం సిద్ధిస్తుందేమోనని భయపడనవసరంలేదు. ఎందుకంటే, అపజయం ద్వారానే లాభం పొందిన మణికుంజుడి వంటి వాళ్ళు కూడా ఉన్నారు. శ్రమ తెలియకుండా నీకు అతని కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం మణిపురాన్ని ఏలిన సింహభూపాలుడికి మందారవల్లి అనే అసాధారణ సౌందర్యవతి కుమార్తెగా ఉండేది. అందానికి తోడు ఆమె గొప్ప ప్రజ్ఞావంతురాలు కావటంచేత యుక్తవయసు వచ్చేసరికి అన్ని విద్యలలోనూ ఆరితేరింది.

## బేతాళ కథలు



సింహభూపాలుడు ఆమెకు వివాహం జరపనిశ్చయించి, తగిన వరుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు.

ఎంత వెతికినా రాజకుమారులలో మందారవల్లికి తగినవాడు ఒక్కడూ ఆయనకు కనిపించలేదు. చివరకు ఆయనకు కనకపురి రాజకుమారుడు మణికుంజుడు అన్నివిధాలా యోగ్యుడుగా తోచాడు.

అయితే మణికుంజుడి విషయంలో సింహభూపాలుడికి ఒక చిక్కు ఎదురయింది. మణిపురంతో పోలిస్తే కనకపురి చాలా అల్పమైన రాజ్యం. తన కన్న చాలా తక్కువ హోదాగల రాజకుమారుడి వద్దకువెళ్ళి, తన కుమార్తెను చేసుకోమని అడగటం సింహభూపాలుడి హోదాకు తగినపని కాదు. అలా అని మణికుంజుడి లాంటి మంచి అల్లుణ్ణి వదులుకోవటం కూడా ఆయనకు ఇష్టంలేదు.

అప్పుడు సింహభూపాలుడి మంత్రి ఒక ఉపాయం చెప్పాడు. అదేమంటే, సింహభూపాలుడు మణికుంజుడి మీదికి దండెత్తివెళ్ళి, అతన్ని ఓడించి, తరవాత జరిగే సంధినియమం కింద తన కుమార్తె మందారవల్లిని అతనికిచ్చి పెళ్ళి చెయ్యటం.

ఆ ప్రకారమే సింహభూపాలుడు తన సైన్యాలను తరలించుకుని, మణికుంజుడి రాజ్యం మీదికి యుద్ధానికి వెళ్ళాడు. ఇది చూసి మణికుంజుడు ఆశ్చర్యపోయాడు. అతను రాజ్యానికి వచ్చి కొద్దికాలమే అయింది. అతనికీ, మణిపురరాజుకూ శత్రుత్వం ఏమీ లేదు. అకారణంగా ఆయన తన మీదికి ఎందుకు యుద్ధానికి వచ్చాడో మణికుంజుడికి ఎంత ఆలోచించినా అర్థంకాలేదు.

అతను మంత్రులతో ఆలోచిస్తే వాళ్ళు, "మనం యుద్ధానికి సిద్ధంగాలేం. ఇప్పుడు యుద్ధంచేస్తే జననష్టం తప్ప మనకేమీ ప్రయోజనం ఉండదు. అందుచేత ప్రస్తు

తానికి సంధి చేసుకోవటం అన్నివిధాలా క్షేమం,'' అని సలహా ఇచ్చారు.

మంత్రుల సలహా పాటించి మణికుంజుడు సింహభూపాలుడి వద్దకు సంధి రాయబారం పంపాడు. సింహభూపాలుడు అందుకు వెంటనే సమ్మతించి, మణికుంజుణ్ణి సంప్రతింపులకు పిలిచాడు. ఆ యువకుణ్ణి స్వయంగాచూసిన మీదట సింహభూపాలుడు పరవశుడైపోయి, తన కుమార్తెను అతనికిచ్చి పెళ్ళిచేసి, ఆ విధంగా సంధి చేసుకుంటా నన్నాడు. మణికుంజుడికి ఇది మరింత విడ్డూరంగా తోచింది. అయినా అతను సింహభూపాలుడి కుమార్తెను పెళ్ళాడటానికి ఒప్పుకున్నాడు.

సింహభూపాలుడు తన పని విజయవంతమైనందుకు సంతోషించి, రాజధానికి తిరిగి వచ్చాడు. మణికుంజుడి వివరాలు అదివరకే వినిఉన్న మందారవల్లి అతన్ని పెళ్ళాడటానికి చాలా కాలంగా సుముఖురాలై ఉన్నది. ఆ సంగతి సింహభూపాలుడికి తెలుసును. ఆయన మణికుంజుడి మీదికి యుద్ధానికి పోతున్నట్టు తెలియగానే ఆమె ఎంతో బాధపడి, తండ్రిని నివారించ యత్నించింది. అదిచూసి సింహభూపాలుడు లోలోపల సంతోషించినా, తన ఎత్తుగడ ఏమిటో మందారవల్లికి చెప్పలేదు. ఆమె హృదయం తనకు తెలుసును గనకనే, ఆమెతో చెప్పకుండానే ఆయన సంధి





నెపంమీద మందారవల్లికీ, మణికుంజుడికీ పెళ్ళి ఏర్పాటుచేశాడు.

అయితే, సింహభూపాలుడు తిరిగి వచ్చి, తన కుమార్తెతో తాను చేసిన పెళ్లి ఏర్పాటు గురించి చెప్పగానే, ఆమె తాను ఆ పెళ్ళికి ఒప్పుకోనని స్పష్టంగా చెప్పేసింది. ఎన్నివిధాల నచ్చచెప్పినా ఆమె మనసు మారలేదు. అందుచేత సింహభూపాలుడు, వివాహం రద్దు అయినట్టు మణికుంజుడికి కబురుచేసి, ఇక తన కుమార్తెకు తగిన వరుడు దొరకడేమోనని దిగులుపడసాగాడు.

పెళ్ళి రద్దయిందని సింహభూపాలుడి నుంచి వార్త అందగానే మణికుంజుడు తనకు తీరని అవమానం జరిగినట్టు భావించి, తన సైన్యాన్ని వెంటనే ఆయత్తంచేసి, సింహభూపాలుడి పైకి యుద్ధానికివెళ్లాడు.

అతను తన చిన్న సేనతో సింహభూపాలుణ్ణి జయించటం అసంభవం. యుద్ధం ఆరంభమవుతూనే మణికుంజుడూ, సింహభూపాలుడూ ఒకరినొకరు ఎదిరించారు. త్వరలోనే సింహభూపాలుడు మణికుంజుణ్ణి నిరాయుధుణ్ణి చేసి, బందీగా పట్టుకున్నాడు. అయితే అతని ధైర్య సాహసాలు శత్రుసైనికులకు కూడా దిగ్భ్రమ కలిగించాయి.

మణికుంజుణ్ణి జయించినందుకు సింహభూపాలుడికి ఆనందమేమీ కలగలేదు. అతన్ని గురించి ఏమి చెయ్యటమా అని ఆయన ఆలోచిస్తూండగా, మందారవల్లి ఆయన వద్దకు వచ్చి, తనను అతనికి ఇచ్చి పెళ్ళిచేసి, అతనితో సంధి చేసుకోమని కోరింది. సింహభూపాలుడికి పెద్ద బరువు తీరిపోయింది. అతను తన కుమార్తెను మణికుంజుడికి ఇచ్చి పెళ్ళి చేసేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, మందారవల్లి సులువుగా తనకు అవకాశం చిక్కినప్పుడు మణికుంజుణ్ణి పెళ్ళాడటానికి ఎందుకు నిరాకరించింది?

ఆ మణికుంజుడే శత్రువై తన తండ్రి మీదికి యుద్ధానికి వచ్చి, మీదుమిక్కిలి యుద్ధంలో ఓడిపోయిన మీదట అతన్ని పెళ్ళాడటానికి ఎందుకు ఒప్పుకున్నది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల బద్ధలవుతుంది." అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "మందారవల్లి ఎంత సునిశితబుద్ధిగలదో ఆమె ప్రవర్తనలో స్పష్టంగా కనబడుతుంది. ఆమె మొదటినుంచీ మణికుంజుణ్ణి వరించిన మాట స్పష్టం. అయితే అతను తనను వరించాడోలేదో ఆమెకు తెలీదు. తమ ఇద్దరికీ పెళ్ళి చెయ్యటానికి తన తండ్రి అతనిపై యుద్ధానికి పోవటం ఆమెకు పొరపాటుగా కనబడింది. ఆ యుద్ధంలో మణికుంజుడు ఓడిపోయి, విధిలేని పరిస్థితిలో తనను పెళ్ళాడటానికి ఒప్పుకోవటం ఆమెకు ఎంతమాత్రమూ ఇష్టం లేదు. కనీసం అలాకూడా జరగలేదు. మణికుంజుడు క్షత్రియోచితంగా యుద్ధం కూడా చెయ్యకుండా సంధికి ఒప్పుకుని తనను పెళ్ళాడటానికి సిద్ధపడ్డాడు. తన భర్త పిరికివాడన్న అపఖ్యాతి భరించటం ఆమెకు మరింత దుర్భరమై, అతన్ని పెళ్ళాడ నిరాకరించింది. అయితే, ఎప్పుడైతే మణికుంజుడు తన తండ్రి మీదికి యుద్ధానికి వచ్చాడో అప్పుడే మందారవల్లికి రెండు సందేహాలూ తీరిపోయాయి. తనను చేసుకునేటందుకు కాకపోతే అతను యుద్ధానికి రావలిసిన పనిలేదు. గెలిచే అవకాశం ఏమాత్రమూ లేకుండా పోరాటానికి దిగినవాడి క్షత్రియ వీరాన్ని శంకించటానికి అవకాశంలేదు. క్షాత్రధర్మం యుద్ధం చెయ్యటంలో ఉన్నదిగాని, గెలవటంలో మాత్రమే ఉండదు. అందుచేత మందారవల్లి ఈసారి మణికుంజుణ్ణి పెళ్ళాడటానికి ఒప్పుకున్నది,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# 166. మనిషిచేయని శిల్పాలు

దక్షిణ డకోటారాష్ట్రం (ఉ. అమెరికా)లో "మరుభూములు" అని చెప్పబడేవి ఉన్నాయి. అక్కడ చెట్లు పెరగవు. ఆ ప్రాంతం భూగోళ కాలమానం ప్రకారం "ఇటీవలి" దాకా నీటి అడుగున ఉండేది. ఆ జలాలలో మట్టి పొరలు ఎలాటి వింతరూపాలలో పేరుకున్నాయో బొమ్మలో చూడవచ్చు.

ఈ మరు భూములలో అందరినీ ఆశ్చర్యపరిచే ఈ సహజ శిల్పాలేగాక, శాస్త్రవేత్తలు అమూల్యంగా పరిగణించే అనేక ప్రాచీన ప్రాణుల అవశేషాలు కూడా దొరికాయి. ఆ ప్రాచీన ప్రాణులలో మూడు కాలివేళ్ళు గల గుర్రాలూ, మొసళ్ళూ, ఖడ్గమృగాలూ, కత్తికోరపులులూ, జింకలూ, ఒంటెలూ, చిన్న ఎలుక జాతి మృగాలూ, 13 అడుగుల నిడివిగల చేపా, ఇంకా అనేక జంతువులూ ఉన్నాయి. అన్నిటికన్న వింత అయినది "బ్రాంటోతీరియం" అనే జంతువు తల ఎముక. ఇది ఖడ్గమృగాన్నిపోలి, ఏను గంత ప్రమాణం కలిగి ఉండేది.





# ఆస్థాన విదూషకుడి యుక్తి

కృష్ణదేవమహారాజు సంస్థానంలో గోపాలుడు అనే విదూషకుడు ఉండేవాడు. అతను మంచి హాస్యగాడేగాక, అనేక విద్యలలో ఆరితేరినవాడు. అతనికి తెలిసిన విద్యలలో ఇంద్రజాలం కూడా ఒకటి. అయితే గోపాలుడు ఇంద్రజాల ప్రదర్శనలుచేసి ప్రజలను ఆనందింపజేసేవాడుకాడు. అతనికి ఇంద్రజాలం తెలుసునని రాజు కూడా ఎరగడు.

కృష్ణదేవుడికి గోపాలుడంటే చాలా ఇష్టం. అందుచేత ఆయన గోపాలుడికి అవసరం కలిగినప్పుడల్లా సహాయపడుతూ ఉండేవాడు. అయితే గోపాలుడు అమిత దుబారా మనిషి. చేతిలో డబ్బు లేకుండా పోయినప్పుడు అతను రాజుగారికి ఏ సాకో చెప్పి, ధనసహాయం పొందేవాడు.

కాని రాను రాను గోపాలుడి ధోరణి రాజుగారికే చిరాకు పుట్టించింది. ఆయన గోపాలుడికి నెల జీతం మించి రాగి దమ్మిడీ సహాయం కూడా చెయ్యటం మానేశాడు. గోపాలుడు చిక్కులోపడి, సంస్థానంలో ఉండే తన మిత్రుల వద్ద అప్పులు చెయ్యటానికి ప్రయత్నించాడు కాని రాజు గోపాలుడికి ఎవరూ అప్పులు పెట్టరాదని ముందుగానే హెచ్చరించి ఉండటంచేత గోపాలుడి ప్రయత్నం ఫలించలేదు.

గోపాలుడి మామగారు పొరుగున ఉండే రాణీపూరు సంస్థానానికి చెందిన వర్తకుడు. ఆయన పేరు హీరాదత్తుడు. హీరాదత్తుడు కృష్ణదేవుడి సంస్థానంలో ఒక వర్తకుడి వద్ద గల అరుదైన పట్టు వస్త్రాలను బేరంచేసి ఉంచాడు. అందుచేత ఆయన అక్కడికి ప్రయాణమయాడు.

అయితే సరిహద్దు వద్ద దొంగలు హీరాదత్తుణ్ణి నిలువు దోపిడీచేసి, కట్టుబట్టలతో

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు




వదిలేశారు. ఆయన తన కూతురినీ, అల్లుణ్ణీ చేరుకునేముందు, పట్టువస్త్రాల వర్తకుణ్ణి కలుసుకుని, తనకు జరిగిన అక్రమం చెప్పి, సరుకు అరువు ఇయ్యమని అడిగాడు.

"అరువు బేరం కుదరదు. మీరు మూడు రోజులలోగా డబ్బు ఇచ్చి సరుకు తీసుకోకపోతే మీరిచ్చిన బయానా సొమ్ము కూడా పోతుంది," అన్నాడు వర్తకుడు.

"అంటే నేను మీకు ఇవ్వతేలే అయిదువేలూ చెల్లించకపోతే, నేను లోగడ ఇచ్చిన నలభైఅయిదు వేలూ వదులుకోవాలనా మీ ఉద్దేశం?" అని హీరాదత్తుడు అడిగాడు.

"అవును. షరతుప్రకారం అంతే గదా?" అన్నాడు వర్తకుడు.

హీరాదత్తుడు ఇంటికి తిరిగి వెళ్ళి, మిగతా సొమ్ము తీసుకు రావటానికి గాని, ఎవరినైనా పంపి తెప్పించటానికి గాని వ్యవధి చాలదు. రాజుగారికి అభిమాన పాత్రుడైన తన అల్లుడు తనకు కావలిసిన అయిదువేలూ సర్దవచ్చునని ఆయన అనుకున్నాడు.

హీరాదత్తుడు గోపాలుడి ఇంటికి వచ్చి, సంగతి అంతా చెప్పాడు. హీరాదత్తుడి సమస్య గోపాలుడి పరువు సమస్య అయి కూర్చున్నది. అవి నెలాఖరు రోజులు. అసలే గోపాలుడు ఇంటి ఖర్చు అమిత పొదుపుగా చేసుకుంటూ వస్తున్నాడు. గోపాలుడు ఎంత ఆలోచించినా అతనికి ఏమీ పాలుపోలేదు.

ఆ రోజు గడిచింది. మర్నాడు ఉదయం అతను ఎప్పటిలాగే కొలువుకు వెళ్ళాడు. ఎంతసేపు చూసినా కృష్ణదేవుడు సభకు రాలేదు. రెండు గంటలు గడిచిన మీదట ప్రధాని వచ్చి, రాజుగారు రాణిగారి మందిరంలో సొంత వ్యవహారాలలో నిమగ్నులై ఉన్నారనీ, ఆ రోజు సభ జరగదనీ తెలిపాడు.

ఏమిజరిగి ఉంటుందా అని గోపాలుడు ఆశ్చర్యపడ్డాడు. విశ్వాస పాత్రు రాలైన

అంతఃపుర దాసీ ఒకతె ద్వారా గోపాలుడు రహస్యం తెలుసుకున్నాడు.

ఆ రోజు ఉదయమే రాణి తన పుట్టింటికి ప్రయాణంకట్టి, తన వెంట తన భర్త కూడా రావాలని పట్టుపట్టింది. రాజుగారు నగరు విడిచి వెళ్ళే పరిస్థితి ఎంతమాత్రమూ లేదు. ఉత్తరపు సరిహద్దున కొంత అశాంతిగా ఉన్నది. ఆయన రాణికి ఎన్నో విధాల చెప్పి చూశాడు, కాని రాణి వినిపించుకోలేదు.

"మీరు నన్ను మా పుట్టింటికి తీసుకుపోయి తీరవలసిందే! లేకపోతే నేను భోజనం చెయ్యను, స్నానం చెయ్యను, ఏమీ చెయ్యను," అంటూ ఆమె పసిపిల్లలాగా ఏడవసాగింది.

ఈ సంగతి తెలియగానే గోపాలుడు రాజుగారి దర్శనం కోరుతూ, "మహారాజా, తమకు ఏదైనా సమస్య ఉన్నట్టయితే గోపాలుణ్ణి మరవవద్దు. అతడి వల్ల మీకు లాభం ఉండవచ్చు," అని చీటీ పంపాడు.

రాజుగారి మనిషి వచ్చి, గోపాలుణ్ణి రాజుగారి వద్దకు తీసుకుపోయాడు. రాజుగారు జరిగినదంతా చెప్పి, "గోపాల్, నువు రాణీగారి పోరు అరికట్టగలవా? నేను నగరు విడిచి పోవటానికి లేదని నీకూ తెలుసుగద!" అన్నాడు.



"నేను తమ సేవకు ఎప్పుడు సిద్ధంగా లేను? ఆజ్ఞాపించండి," అన్నాడు గోపాలుడు.

"అలా అయితే ఆలశ్యమెందుకు, ఉపక్రమించు. నిన్ను సంతోషపెట్టుతానులే," అన్నాడు రాజు.

"మహారాజా, మహారాణిగారికి చీట్లపేకాట అంటే సరదాగదా? అలా అయితే, నా ప్రయత్నం ఫలిస్తుంది. నాకు కొద్ది గంటలు వ్యవధి ఇయ్యండి." అన్నాడు గోపాలుడు.

అతను ఇంటికి తిరిగివచ్చి, తన ఇంద్రజాలసామగ్రి నుంచి ఒక చీట్లపేక పైకి తీశాడు. ఇది ప్రత్యేకంగా తయారుచేసిన



పేక. ఇందులో ఉండే యాభైరెండు ముక్కల మీదా ఆఠీను రాజు బొమ్మే ఉన్నది. దీనితోబాటు అతను ఒక మామూలు చీట్లపేక కూడా తీసుకున్నాడు.

తరవాత అతను వేషం మార్చుకుని, ఒక సాధువులాగా తయారై, రాజును చూడబోయాడు. ఇద్దరూ కొద్దిసేపు మాట్లాడుకున్నాక గోపాలుడు, ''మహారాజా, మహారాణిగారి అంతరంగిక పరిచారికను పిలిపించండి. నాకు ఆమె సహాయం కావాలి,'' అన్నాడు.

పరిచారిక వచ్చింది. గోపాలుడు ఆమెకు తన పథకమంతా చెప్పి, తనవద్ద ఉన్న రెండు చీట్లపేకలూ ఆమెకిచ్చి, అందులో ఒకదానిమీద పెట్టిన గుర్తు చూపించి, ''నిన్ను చీట్లపేక తెమ్మని మొదటిసారి అడిగినప్పుడు ఈ గుర్తులేని పేక తీసుకురా. అవి తిరిగి నీ కివ్వగానే పేకలు మార్చి, రెండోసారి ఈ గుర్తుగల పేక తీసుకురావాలి. ఈ మార్పు రాణిగారు తెలుసుకోకుండా జరగాలి. అర్థమయిందిగద?'' అన్నాడు.

పరిచారిక మీద కొన్ని ప్రయోగాలు చేసి, తృప్తిపడినాక ఆమెను రాణిగారి మందిరానికి పంపేశారు. రాజుగారూ, గోపాలుడూ చెప్పిన ప్రకారం పరిచారిక రాణి వద్దకు పరిగెత్తుకుంటూ పోయి, ''అమ్మా, మహారాణీ! రాజభవనానికి ఎవరో గొప్ప యోగి వచ్చాడు. ఆయన అదృష్టం చెబుతాడట, పిలవమంటారా?" అని అడిగింది.

"అలాగే పిలుచుకురా. ఏం చెబుతాడో చూద్దాం,'' అన్నది రాణి ఉత్సాహం లేకుండా.

మారువేషంలో ఉన్న గోపాలుణ్ణి రాణి వద్దకు తెచ్చారు. గోపాలుడు ఆమెతో, ''అమ్మా, మీరు విచారభారంతో ఉన్నట్టు కనిపిస్తున్నారు. దయచేసి మీ చెయ్యి ఒకసారి చూపిస్తారా?'' అన్నాడు.

రాణి తన ఎడమచెయ్యి చాచింది. గోపాలుడు ఆమె చెయ్యి పరీక్షించి,

"అమ్మా, మీ కోరిక ఏదో మీ భర్త నిరాకరించారు. అవునా ?'' అని అడిగాడు.

రాణి జవాబు చెప్పలేదు.

గోపాలుడు ఆమె చేతిని మరింత శ్రద్ధగా పరిశీలించి, "తెలుస్తూనే ఉన్నది. మీరు మీ పుట్టింటికి ప్రయాణమై, మీ భర్తను వెంట రమ్మన్నారు. వారు అందుకు అంగీకరించలేదు. అసలు సమస్య ఏమంటే, మీ ప్రయాణం అసలు మంచిదా, కాదా అని! అరె, ఈ రేఖ ఏమిటి ? మీకు చీట్లాట అంటే ఇష్టంలా గుందే!'' అంటూ రాణి కేసి చూశాడు.

రాణి ముక్తసరిగా, "నిజమే!'' అన్నది.

'' అలా అయితే చీట్లపేక సహాయంతో సమస్యను పరిష్కరించుధాం. మీ దగ్గిర కొత్త పేక ఏదైనా ఉన్నదా?'' అన్నాడు గోపాలుడు.

పరిచారిక వెళ్ళి, గోపాలుడు తన కిచ్చిన పేకలలో మామూలు పేక తెచ్చింది. గోపాలుడు ముక్కలు పైకితీసి, అన్నిటినీ నేలమీద వెల్లకిలా పరిచి పరీక్షించి, తిరిగి అన్నిటినీ పెట్టెలో పెట్టేసి, పరిచారిక చేతికి ఇచ్చేశాడు.

అతను రాణితో, "అమ్మా, క్రితం రాత్రి మీకు పీడ కలలు ఏమైనా వచ్చాయా ?'' అని అడిగాడు. రాణి లేదన్నది.

'' అలాఅయితే పేక వల్ల ప్రయోజనం ఉంటుంది,'' అంటూ గోపాలుడు పరిచారిక నుంచి చీట్లపేక తీసుకున్నాడు. గోపాలుడు రాణితో మాట్లాడుతున్న సమ



యంలో పరిచారిక పేకలు మార్చేసి, అతనికి గుర్తుగల పేక ఇచ్చింది. అందు లోని ముక్కలు వెనకనుంచి చూడటానికి రెండో పేకలోని ముక్కలల్లేనే ఉన్నాయి కాని, అన్నీ ఆఠీను రాజు బొమ్మలే.

గోపాలుడు ఆ పేక ముక్కలు కలిపి, బోర్లాగా ఉంచి ముక్కలను విసనకర్ర ఆకారంలో విప్పి రాణి ముందుంచి, "అమ్మా, ఈ యాభైరెండు ముక్కలలో మీ ఇష్టంవచ్చిన ముక్క తీయండి. దాన్నిబట్టి మీ నిర్ణయం సరి అయినదో, మీ భర్తగారి నిర్ణయం సరి అయినదో తెలుస్తుంది. మీరు తీసే ముక్క ఆఠీను రాజు అయే పక్షంలో మీ భర్తగారిదే విజయం. అలా కాని పక్షంలో మీ నిర్ణయమే సరి అయినది," అన్నాడు.

రాణి ఒక ముక్క తీసి, చూడకుండానే నేలమీద ఉంచింది. మిగిలిన ముక్కలను గోపాలుడు పరిచారికకు తిరిగి ఇచ్చేశాడు. అంతలో రాజు అక్కడికి వచ్చి, పరిచారిక చేతిలోని పేక తీసుకుని తన జేబులో పెట్టుకుంటూ, "ఏం జరుగుతున్నది ఇక్కడ?" అని అడిగాడు.

పరిచారిక అంతా చెప్పింది. పేకముక్క వెల్లికిలాతిప్పితే, అది ఆఠీనురాజు!

"అమ్మా, మీరు పుట్టింటికి వెళ్లటానికి ఇది తగిన సమయం కానట్టు కనబడుతుంది. దారిలో ఏ ప్రమాదమైనా కలగవచ్చు," అన్నాడు గోపాలుడు.

రాణికి ఈ మాటలో గురికుదిరి, "అలా అయితే ప్రయాణం మానుకుంటాను," అన్నది.

గోపాలుణ్ణి విడిపించటానికి రాజు, "స్వామీ, నా గదికి కూడా వచ్చి, నా చెయ్యి కూడా చూడండి," అన్నాడు.

ఇవతలికి వచ్చినాక రాజు, "గోపాల్, గొప్పగా పనిచేశావు," అని ఒక సంచీ పైకితీసి, "ఇది నీ బహుమానం. ఇంటికి పోయి చూసుకో," అన్నాడు.

ఆ సంచీలో పదిహేనువేల రూపాయల ఖరీదు చేసే బంగారు నాణాలున్నాయి. హీరాదత్తుడి అవసరాన్నిమించే దొరికింది.





# దైవసహాయం

ఒక ఊళ్ళో ఒక వడ్డీ వ్యాపారస్థుడు ఉండేవాడు. ఆయన పూర్వీకులు కూడా వడ్డీ వ్యాపారస్థులే. వాళ్లు ఈ వ్యాపారంలో లక్షలు గడించారు. ఇతను కూడా వాళ్ళ లాగే తన వ్యాపారం అభివృద్ధి కావటానికి అనేక పాపాలు చేసేవాడు. అయితే ఇతనిలో ప్రత్యేకత ఏమిటంటే, ఇతనికి దేవుడిపైన అపారమైన నమ్మకం ఉండేది. అతను దేవుణ్ణి పూజించకుండా ఏ పనీ చేసేవాడు కాదు; తనకు వ్యాపారంలో వచ్చిన లాభంలో ఒక వంతు ఏ దేవాలయంలోనో మొక్కుబడి కింద చెల్లిస్తూ వుండేవాడు.

అతనికి కులశేఖరుడు అనే కొడుకు వుండేవాడు. తన తండ్రి రోజూ చేసే పూజలు చూసి అతనికి దైవమంటే అమితమైన భక్తి కుదిరింది. అది అతని వయసుతో బాటే పెరిగింది. తన తండ్రి దైవభక్తి కలవాడు కావటం చేతనే ఆయన పట్టినదల్లా బంగారమయిందని అతను నమ్మాడు.

కులశేఖరుడికి యుక్తవయసు రాగానే అతనికి వ్యాపార రహస్యాలన్నీ చెబుదామని తండ్రి అనుకున్నాడు. కాని ఆ అవకాశం చిక్కకుండానే ఆయన ఆకస్మికంగా చనిపోయాడు.

తండ్రి పోయాక కులశేఖరుడు తండ్రి వ్యావారం కొనసాగించాడు. అతను దైవభక్తి విడిచిపెట్టలేదు. అతను నిష్కల్మషమైన మనస్సుతో, ఏ కోరికలూ లేకుండా దైవధ్యానం చేసేవాడు. అతనికి వ్యాపారం కలిసి వచ్చింది. అందుకు కారణం తనకు దైవసహాయం ఉండటమేనని అతను అనుకునేవాడు.

తండ్రి పోయిన ఏడాదికి కులశేఖరుడు హైమవతి అనే కన్యను వివాహం

వీరేపల్లి జయరాంరెడ్డి



చేసుకున్నాడు. ఆమెకూడా అపారమైన దైవభక్తి కలది కావటం తన అదృష్టమని అతను అనుకున్నాడు. కాని ఆమె కాపరానికి వచ్చినది మొదలు అతని వ్యాపారంలో లాభాలు రాకపోగా నష్టం రాసాగింది. అయినా అతను దాన్ని అంతగా పట్టించుకో లేదు.

ఆరునెలలు తిరిగేసరికి అతని పంట పొలాలు వరదల మూలంగా దెబ్బ తిన్నాయి. పంటలు పాడుకావటమే గాక, పొలాలు మేటవేసిపోయాయి. మరో నెల గడిచేసరికి అతని దుకాణంలో దొంగలు పడి సమస్తమూ దోచేశారు. ఆటుతరవాత కొద్ది రోజులకు, ఒక రాత్రి అతని ఇల్లు అంటుకుని, పూర్తిగా కాలి, నేల మట్టమయింది. అతనూ, అతని భార్యా కట్టు గుడ్డలతో బయటపడ్డారు.

శాపం పెట్టినట్టు సర్వనాశనం సంభవించేసరికి కులశేఖరుడికి మతిపోయినట్టయింది. ధనికుడుగా బతికిన ఊళ్ళో బికారిగా బతకలేక, దారిద్ర్యంలో భార్య తరపువాళ్ళను ఆశ్రయించటానికి మనసు ఒప్పక, మరెక్కడనైనా ముష్టిఎత్తుకు బతికే ఉద్దేశంతో అతను తన భార్యతో సహా ఊరు విడిచి బయలుదేరాడు. సాయంత్రం అయేసరికి వాళ్ళు ఒక ఊరి పొలిమేరలో ఉన్న పాడుబడిన శివాలయం చేరుకుని, ఆ రాత్రికి ఆ ఆలయ ప్రాంగణంలో పడుకున్నారు.

అర్ధరాత్రివేళ ఆకాశాన కారుమబ్బులు కమ్మి, ప్రచండమైన గాలి వీచసాగింది. భర్త పక్కనే పడుకుని ఉన్న హైమవతికి హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఆమె తల ఎత్తి చూసేసరికి పాడుబడిన ధ్వజస్తంభం గాలిలో ప్రమాదకరంగా అటూ ఇటూ ఊగుతూండటం కనిపించింది. అది ఏ క్షణాన అయినా విరిగి పడేటట్టున్నది.

హైమవతి భర్తను తట్టి లేపింది. ఇద్దరూ గబగబా ఆలయంలోకి వెళ్ళారు. మరుక్షణమే పెళపెళా శబ్దంచేస్తూ

ధ్వజస్తంభం విరిగి, సరిగా వాళ్ళు పడుకుని ఉండిన స్థలంలోనే పడింది.

తన సర్వస్వమూ పోవటమేగాక, తన ప్రాణాలకు కూడా అపాయం రావటం చూసినమీదట, తన కష్టాల కన్నిటికీ అసలు కారణం తన భార్యేనని కులశేఖరుడు రూఢిచేసుకున్నాడు. అతను హైమవతితో, "నిన్ను కట్టుకున్నాకనే నాకు అనర్థాలు ఆరంభమయాయి. నీ మూలానే నాకు దైవసహాయం కూడా అందకుండాపోయింది. ఇప్పుడు వెంట్రుకవాసిలో నాకు ప్రాణగండం తప్పింది. నువు నా వెంట ఉంటే ఇంకా ఎన్ని ఘోరాలు ఎదురవుతాయో! నీ పాపిష్ఠి మొహం ఇక నాకు చూపించకు. నువు నీ పుట్టింటికి వెళ్ళిపో," అన్నాడు.

చేసేదిలేక హైమవతి గుడ్లనీరు కుక్కుకుంటూ, వెనక్కు తిరిగి వెళ్ళిపోయింది.

ఇంతలో గర్భగుడిలో నుంచి శివయోగి ఒకడు గబగబా ఇవతలికి వచ్చి, హైమవతిని చెయ్యి పట్టుకుని ఆపి, "నాయనా, దేవతలాంటి నీయింటి లక్ష్మిని ఎందుకు తరిమివేస్తున్నావు?" అని కులశేఖరుణ్ణి అడిగాడు.

"అది నా యింటి లక్ష్మికాదు, నా పాలిటి శని! ఇది నా ఇంట అడుగు పెట్టాక నాకు ఏదీ కలిసి రాలేదు.



పైపెచ్చు ఉన్నదంతా ఊడ్చిపెట్టుకుపోయింది. ఇప్పుడు నా ప్రాణాలే పోయినంతపని కూడా జరిగింది," అంటూ జరిగినదంతా చెప్పాడు కులశేఖరుడు.

అంతావిని శివయోగి గట్టిగా నవ్వి, "పిచ్చివాడా, నువు చెప్పినదాన్నిబట్టే ఈమె నీ అదృష్టదేవత అని స్పష్టమవుతున్నది. జరిగిన సంఘటనలను సరిగా అర్థం చేసుకోలేక, నువు ఈమెను గురించి అపోహ పడ్డావు," అన్నాడు.

"ఏమిటి మీరనేది?" అన్నాడు కులశేఖరుడు అయోమయంగా.

"నీకు దైవసహాయం అందటం మొదలుపెట్టినది ఈమె నీ యింట

అడుగుపెట్టినాకనే. నీ తాత తండ్రులు అనేక పాపాలు చేసి కూడబెట్టిన ఆస్తికి వారసుడవు కావటంచేత నీకు కూడా వాళ్ళ పాపం సంక్రమించింది. ఆమె కూడా భక్తురాలు కావటంవల్లా, నీ భక్తి పరిపూర్ణం కావటంవల్లా, నీ పట్ల భగవంతుడు కరుణించాడు. ఆయన నిన్ను పవిత్రుణ్ణి చేసే కార్యక్రమం ఆరంభించాడు. యాదృచ్ఛికంగా జరిగిన సంఘటనలన్నీ దానికి సంబంధించినవే. పెళ్ళికి మునుపు నీకు వ్యాపారం కలిసి రావటం దైవఘటనకాదు. అది నీ స్వయం కృషీ, అదృష్టమూ మాత్రమే. నిజానికి ఈ రోజుతో నీ ఆయుర్దాయం తీరి పోయింది. అయినా దైవకృపవల్ల నువు బతికావు. దైవప్రేరణవల్లనే నీ భార్య నీ ప్రాణాలు కాపాడ గలిగింది. మీరిద్దరూ ఇప్పుడు పాపంలేని పుణ్యాత్ములు. ఇప్పుడు నువు తిరిగి వ్యాపారం ప్రారంభించు, దైవసహాయంవల్ల తిరిగి ధనవంతుడివికా గలుగుతావు.'' అన్నాడు శివయోగి.

కులశేఖరుడికి ఇప్పుడు జరిగినదంతా స్పష్టంగా అర్థమయింది. అతను హైమవతికి క్షమాపణ చెప్పుకుని, శివయోగి కాళ్ళకు మొక్కి, ''స్వామీ, నా కొక చిన్న సందేహం. నాలాగే నా తండ్రి కూడా దైవభక్తి కలవాడేగదా, ఆయనకు దైవ సహాయం ఎందుకు అందలేదు?'' అని అడిగాడు.

''నీ తండ్రికి దైవం పట్ల ఉండినది భక్తికాదు, నమ్మకం. అతను భగవంతుడితో వ్యాపారం చేశాడు. ఆ వ్యాపారంలో చాలా పాపాలూ, మోసాలూ చేశాడు. కోరికలను తీర్చుకోవటం కోసం భగవంతుణ్ణి పూజించటం భక్తి అనిపించుకోదు. అందుకే అతనికి దైవసహాయం అందలేదు.'' అన్నాడు శివయోగి.

కులశేఖరుడి అనుమానం తీరింది. అతను శివయోగి ఆశీర్వచనం పొంది, ఆ ఊళ్ళోనే మళ్ళీ వ్యాపారం ప్రారంభించి, త్వరలోనే ధనవంతుడై, దానధర్మాలు చేస్తూ పుణ్యాత్ముడుగా బతికాడు.



చందమామ సంచాలకులు శ్రీ చక్రపాణి సెప్టెంబరు 24 ఉదయం ఆకస్మికంగా మరణించిన వార్త చందమామ పాఠకులకు సంతాపంతో అందజేస్తున్నాము.

చందమామ శ్రీ చక్రపాణి మానస పుత్రిక. ఆయన ఈ పత్రికను గురించి ఎన్నో దశాబ్దాలుగా కలలు కన్నారు. ఆయనకు శ్రీ నాగిరెడ్డి సాహచర్యం లభించడంతో ఈ పత్రికకు వాస్తవరూపం ఏర్పడింది. 1947 జులైలో - భారత స్వాతంత్ర్యానికి ఒకటిన్నర మాసాలు ముందుగా-చందమామ రెండు భాషలలో (తెలుగు, తమిళం) అవతరించింది. ఆటు తరవాత ఇది ఇతర భాషలలోకి విస్తరించి, ఈ నాటికీ అద్వితీయంగా పురోగమించటానికి ప్రధాన కారణం శ్రీ చక్రపాణి చందమామ పట్ల ఎడతెగకుండా చూపుతూ వచ్చిన శ్రద్ధ మాత్రమే.

శ్రీ చక్రపాణి బహుముఖ వ్యాపకాలు గల వ్యక్తి. చందమామ నిర్వహణలోనే గాక సినిమారంగంలో కూడా నాగిరెడ్డి, చక్రపాణి ద్వయం నరనారాయణులు అనదగినవారు. లోగడ శ్రీ చక్రపాణి ఆంధ్రజ్యోతి, సంచారి, కినిమా, యువ మాస పత్రికలనూ; ప్రత్యేకంగా యువ, యువ ప్రెస్, ప్రాసెస్‌లనూ నిర్వహించారు. ఎన్ని ఇతర వ్యాపకాలు ఉండినా, చందమామ పురోభివృద్ధి కోసం ఆయన ఎంతగానో కృషి చేస్తూనే వచ్చారు.

శ్రీ చక్రపాణికి పెద్ద చదువులు లేకపోయినప్పటికీ ఆయనకు స్వయం కృషి ద్వారా ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, సంస్కృత భాషలలో మంచి ప్రవేశం లభించింది. 1940 లో ఆయన సినిమా రంగంలో ప్రవేశించేనాటికి, ప్రముఖ బెంగాలీ రచనలను అనేకంగా తెలుగులోకి అనువదించారు. తెలుగు వారికి శరత్ రచనలు మప్పినది శ్రీ చక్రపాణి అనే చెప్పాలి. అంతకు పూర్వం ఒకరిద్దరు బెంగాలీ సాహిత్యాన్ని తెలుగులోకి అనువదించినప్పటికీ చక్రపాణి అనువాదాల ద్వారానే శరత్ రచనలు ఆంధ్రుల మీద తమ ప్రభావాన్ని ప్రసరించాయి.

శ్రీ చక్రపాణి ఆగస్టు 5, 1908 న తెనాలి, ఐతానగరప్పాడులో సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. ఆయన అసలు పేరు ఆలూరి వెంకట సుబ్బారావు. చక్రపాణి అన్నది కలం పేరు. యౌవన దశలోనే ఆయనకు క్షయ వ్యాధి సోకింది. చికిత్స కోసం ఆయన మదనపల్లి శానిటోరియంలో ఉండగా ఆయనకు ఒక బెంగాలీబాబు పరిచయం లభించింది. ఆయన

ప్రోత్సాహంతోనే శ్రీ చక్రపాణి బెంగాలీ భాష నేర్చుకున్నారు.

జాతీయోద్యమ ప్రభావం వల్ల ఆయన హిందీ నేర్చుకుని, అనేక హిందీ పరీక్షలలో ఉత్తీర్ణుడు కావటమేగాక, ఇతరులకు హిందీలో శిక్షణ ఇచ్చి, వారిచేత పరీక్షలు పాసు చేయించటం కూడా జరిగింది. శ్రీ చక్రపాణి మనస్తత్వంలో ఉన్న ప్రత్యేకత ఏమంటే, ఏది తలపెట్టినా సంపూర్ణంగానూ, సమగ్రంగానూ చెయ్యటం. ఆయన బెంగాలీ అనువాదాలు చూసిన వారొకరు ఆయనను, "మీరు కలకత్తాలో ఎంతకాలం ఉన్నారు?" అని అడిగారు. "నాకు బెంగాల్ దేశం ఎలా ఉంటుందో తెలియదు." అని చక్రపాణిగారు అనేసరికి ఆయన నిర్ఘాంతపోయారు!

శ్రీ చక్రపాణి సొంత రచనలు కూడా కొన్ని పుస్తక రూపంలో వెలువడ్డాయి. ఆయన వ్యంగ్యహాస్యం ఆ రచనలలో కనబడుతుంది. అదే హాస్యం ఆయన తీసిన సినిమాలలో కూడా మనకు కనబడుతుంది. "పెళ్ళిచేసిచూడు," "మిస్సమ్మ," "అప్పుచేసి పప్పుకూడు," ప్రత్యేకించి "గుండమ్మ కథ" చిత్రాలు చక్రపాణి హాస్య ధోరణిని చక్కగా స్పష్టం చేస్తాయి.

విజయా వారి పతాక మీద "క్రియాసిద్ధి స్సత్త్వే భవతి" అన్నది ఏర్పాటు చేసినది శ్రీ చక్రపాణి. విజయం సాధించటం కేవలమూ మనిషి శక్తి మీదనే ఆధారపడుతుందన్నది ఆయన దృఢ విశ్వాసం. ఆయన తలపెట్టిన పుస్తక ప్రచురణా, పత్రికా నిర్వహణా, చిత్ర నిర్మాణమూ మొదలైన కార్యకలాపాలన్నిటనూ ఆయన హెచ్చుగా ఆధారపడినది మనిషి శక్తిమీద. అయిదేసి వేల కాపీలతో రెండు భాషలలో ప్రారంభమైన చందమామ ఈ నాడు 11 భాషలలో, అయిదున్నర లక్షల కాపీల ప్రచారం కలిగి ఉన్నదంటే దీని వెనక మనిషి "సత్త్వం" తప్ప చెప్పకోదగినది మరేదీలేదు. చందమామ అభివృద్ధి ప్రణాళిక ఇంకా మిగిలి ఉండగానే శ్రీ చక్రపాణి పరమపదించటం ఎంతైనా దురదృష్టకరం. అయితే గడచిన 28 చిల్లర సంవత్సరాలుగా చందమామకు చక్రపాణిగారు వేసిన పునాది బలమైనది. అందుచేత చందమామ ప్రణాళిక ముందుకు సాగిపోతుంది. చందమామను 'చిరంజీవి'ని చెయ్యడం కోసం ఆయన అహర్నిశలూ కృషి చేశారు; చందమామ చిరంజీవి; శ్రీ చక్రపాణి అమరజీవి.

మా మార్గదర్శకుడూ —

మా పురోభివృద్ధికి కారణభూతుడూ —

మా ప్రియతముడూ —

శ్రీ చక్రపాణిగారికి

## మా సవినయ శ్రద్ధాంజలి

చందమామ పబ్లికేషన్స్

విజయా ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్

ప్రసాద్ ప్రాసెస్ ప్రైవేట్ లిమిటెడ్

బి. యన్. కె. ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్

వాహిని ప్రొడక్షన్స్ ప్రైవేట్ లిమిటెడ్

యువ పబ్లికేషన్స్



# ఇద్దరు ముసలివాళ్ళు

మహేశుడూ, జగదీశుడూ అని ఇద్దరు మిత్రులు ఉండేవాళ్ళు. వారి అభిప్రాయాలు బొత్తిగా కలవవు. మహేశుడు కష్టపడి పని చేయాలంటాడు. జగదీశుడికి పని అంటే యిష్టంలేదు. ఉన్న ఊళ్లో పొట్టగడవక, పని దొరకక, వాళ్ళు రాజధానికి బయలుదేరారు.

రాజధానికి వెళ్ళాలంటే కొండలూ, అడవులూ దాటి చాలా దూరం వెళ్ళాలి. వేకువజామున బయలుదేరిన వాళ్ళు పట్టుదలగా పగలల్లా నడిచారు. చీకటి పడింది. చలికాలం కావటంచేత చలి ముదిరింది. ఆ రాత్రి ఎక్కడ తల దాచుకోవాలా అని చూస్తూండగా వాళ్ళకు మైదానంలో ఒక భవంతి కనబడింది. దాన్ని చూడగానే వాళ్ళకు ప్రాణం లేచివచ్చింది. భవంతికి ముందు ఒక గుడిసె, దాని పక్కగా ఒక తోటా ఉన్నాయి. భవంతికీ, పాకకూ మధ్య ఉన్న ఖాళీస్థలంలో చలిమంట వేసుకుని ఇద్దరు ముసలివాళ్ళు కూర్చుని ఉన్నారు. వాళ్ళలో ఒకడు ఖరీదైన బట్టలు ధరించి ఉన్నాడు.

"మేం బాటసారులం. ఈ రాత్రికి ఆశ్రయం ఇయ్యగలరా?" అని మిత్రులిద్దరూ ముసలివాళ్ళను అడిగారు.

డబ్బున్న ముసలివాడు, "తప్పక ఇస్తాను. ఈ భవనం నాదే. నా దగ్గిర ప్రత్యేకమైన కోళ్ళు ఉన్నాయి. అవి గుడ్లు పెట్టవు, పిల్లల్నే పెడతాయి. వాటి మాంసం బావుంటుంది. మూడు కోళ్ళు కాల్చుకు తిందాం," అన్నాడు.

ఆ మాట వినగానే జగదీశుడు ఎగిరి గంతేశాడు. మహేశుడికి మాత్రం ఆ ముసలివాడి మాటలు నచ్చలేదు. అతను రెండో ముసలివాడి కేసి చూశాడు.

ఎం. కామేశ్వరరావు



రెండో ముసలివాడు, "చూడు, బాబూ, నేను పేదవాణ్ణి. నేను మీ కోసం ప్రత్యేకంగా ఏమీ చెయ్యలేను. నా భోజనంలో మీకు ఇంత పెడతాను. ఆ పైన మీ యిష్టం," అన్నాడు.

"మేం నీ గుడిసెలోనే ఉంటాం, తాతా," అన్నాడు మహేశుడు.

"నీకేమైనా మతి పోయిందా? ఇంద్ర భవనం లాటి ఇంటిని కాదని ఈ ముష్టి వాడి గుడిసెలో ముడుచుకుని పడుకుంటావా?" అన్నాడు జగదీశుడు.

డబ్బున్నవాడు పక్కున నవ్వి, "అలా బుద్ధిచెప్పు. మీవాడు వట్టి మృగంలా ఉన్నాడు," అన్నాడు.

మహేశుడు తన కోపాన్ని అణచుకుని, జగదీశుడితో, "నువు కావాలంటే ఆయనకు అతిథిగావెళ్ళు. నేను ఈయనకు అతిథిగా ఉంటాను," అన్నాడు.

గొప్పవాడి భవంతి పక్కనే ఒక కొట్టం ఉన్నది. అందులో పాతికపైగా కోళ్ళు ఉన్నాయి. ముసలివాడు రెండు కోళ్ళను పట్టుకువచ్చాడు. ఇద్దరూ సరదాగా ఆ రెండు కోళ్ళనూ కాల్చి, భవంతిలోకి తీసుకుపోయారు.

బీదవాడి దగ్గిర నాలుగు మేకలున్నాయి. వాడు వాటి పాలు పితికాడు. ఇద్దరూ ఇంత జొన్నసంకటి తిని, మేక పాలు తాగారు. తరవాత వాళ్ళు రెండు మంచాలు వేసుకుని కూర్చుని మంచీ, చెడూ మాట్లాడుకున్నారు.

భవంతిలో నుంచి భోజనం వాసనలు వస్తున్నాయి. జగదీశుడూ, డబ్బున్నవాడూ తెగవాగుతూ భోజనాలు కానిచ్చారు. తరవాత ఇద్దరూ తాగినట్టున్నారు. ఇక జగదీశుడి గొంతు వినిపించలేదు. డబ్బున్నవాడే అర్ధరాత్రిదాకా గట్టిగా పాడుతూ, నానాగోలా చేశాడు.

బీదవాడు నిట్టూర్చి, "నేను నాలుగేళ్ళుగా ఇక్కడ ఉంటున్నాను. రెండేళ్ల క్రితం వీడువచ్చి, నాకు పీడగా తయారయాడు. మొదట్లో నాలాగే గుడిసె వేసు

కున్నాడు, కాని సంవత్సరం తిరగకుండానే ఈ భవనం కట్టించాడు. వీడు వచ్చాక నా ఆతిథ్యం స్వీకరించిన వాడివి నువు ఒక్కడివే! అయితే, ఆశ్చర్యం! వాడికి అతిథిగా వచ్చిన వాళ్ళందరూ చీకటితోటే వెళ్ళిపోతారు,'' అన్నాడు.

తరవాత వాళ్ళిద్దరూ పడుకుని నిద్రపోయారు.

మహేశుడు నిద్రలేచేసరికి బారెడు పొద్దెక్కింది. అతను కంగారుగా లేచి వెళ్ళి, ధనికుడి ఇంటి తలుపు తట్టుతూ, జగదీశుడి పేరు పెట్టి పిలిచాడు.

డబ్బున్న ముసలివాడు తలుపు తీసి, ''నీ మిత్రుడు చీకటితోనే వెళ్ళిపోయాడు,'' అని చెప్పి తలుపు వేసుకున్నాడు.

మహేశుడికి ఇందులో ఏదో మోసం ఉన్నదనిపించింది. జగదీశుడు ఏ పరిస్థితిలోనూ తనతో చెప్పకుండా వెళ్ళిపోడు.

"వీడు ఏదో మాయ చేస్తున్నాడు,'' అన్నాడు బీదవాడు.

''వీడి మాయ ఈ రాత్రి తేల్చి పారేస్తాను,'' అన్నాడు మహేశుడు.

అతను పగలల్లా అడవిలో తిరిగి, సాయంకాలానికి ముసలివాళ్ళ వద్దకు వచ్చాడు. "రా, రా! మళ్ళీ వచ్చావేం?'' అన్నాడు బీదవాడు, ఏమీ తెలియనట్టు.



"నీ జొన్నసంకటి ఆతిథ్యం చాలు. ఈ రాత్రి మామకు అతిథిగా ఉంటాను,'' అన్నాడు మహేశుడు.

''అల్లుడూ! పదా, మనం కోళ్ళను కాల్చుకు తిందాం,'' అన్నాడు ధనికుడు.

తరవాత రెండు కోళ్ళను కాల్చుకుని మహేశుడూ, ధనికుడూ భవనంలోకి వెళ్ళారు. ఇద్దరూ తిన్న తరవాత, సారా తాగుదామన్నాడు ముసలివాడు. మహేశుడు తనకు అలవాటు లేదన్నాడు.

''నీ బోటి వాళ్ళకు తియ్యని సారా ఉంచాను,'' అన్నాడు ముసలివాడు.

మధ్య గదిలో రెండు సారా తిత్తులు వేళ్ళాడు తున్నాయి. కుడివైపు తిత్తిలో

నుంచి ఒక లోటా, ఎడమవైపు తిత్తిలో నుంచి మరొక లోటా నింపి, ముసలి వాడు రెండో లోటా మహేశుడికి ఇచ్చి, తాగమన్నాడు.

"మత్తు వస్తుందేమో, నువు తాగి చూపించు," అన్నాడు మహేశుడు.

ముసలివాడు కంగారుగా మహేశుడి చేతి లోటాను తోసివేస్తూ, "నాకు దాని వాసన పడదు! ముందు గదికిరా, తాపీగా తాగుదాం," అంటూ కదిలాడు.

మహేశుడు అనుమానం రూఢి అయింది. అతను చప్పున తిత్తులు మార్చేసి, తన చాకు తీసి, దాన్ని పట్టుకుని పిచ్చి, పిచ్చిగా పాడుతూ నృత్యం చేశాడు. ముసలివాడు తన లోటా ఖాళీ చేసి, "కుడివైపు తిత్తిలోది నాకు మరో లోటా సారా పట్టుకురా," అన్నాడు.

మహేశుడు వెళ్ళి, ఇప్పుడు కుడివైపున ఉన్న తిత్తిని చాకుతో పొడిచాడు. సారా కారి పోసాగింది. అదిచూసి ముసిలాడు, "అయ్యో, నిక్షేపంలాటి సారా!" అంటూ ఆ ధార కింద నోరు పెట్టాడు. వాడు రెండు గుటకలు వేశాడోలేదో, మాట పడిపోయి, కిందపడి తన్నుకుని కోడిపిల్లగా మారిపోయాడు.

మహేశుడు చప్పున కోళ్ళకొట్టం కేసి పరిగెత్తాడు. అక్కడ కోళ్ళకు బదులు మనుషులున్నారు. వారిలో జగదీశుడు కూడా ఉన్నాడు. మహేశుడు తిరిగి లోపలికి వచ్చేసరికి, ఒక గండుపిల్లి కోడిపిల్లను ఎత్తుకుపోతూ కనిపించింది.

"ఎంతపెద్ద భవనం! మనం ఇక్కడే ఉండిపోదాం," అన్నాడు జగదీశుడు.

"ఇంత అనుభవం అయినా, నీ బుద్ధి మారలేదు. కష్టపడకుండా సుఖం అనుభవించాలంటావు! కష్టపడి సంపాదించి అనుభవించటంలోనే ఆనందం ఉన్నది," అన్నాడు మహేశుడు.

తరవాత మిత్రులిద్దరూ ఆ భవంతిని బీద ముసలివాడికి అప్పగించి, బాటసారులకు ఆతిథ్యం జరుపుతూ ఉండమని చెప్పి, ముందుకుసాగిపోయారు.





# హాస్యప్రియుడు

కోసలదేశాన్ని ఏలిన ఆనందసేన మహా రాజుకు అన్నీ ఉండేవి, కాని ఆనందమే లేకపోయింది. ఆయన సాధారణంగా విచారంగా ఉండేవాడు. నిజానికి అందుకు తగిన కారణమేమీ లేదు. ఆయన పాలనలో ప్రజలు ఎలాంటి ఈతి బాధలూ లేక, సుఖంగా జీవిస్తూ ఉండేవారు. కోసల కన్న బలమైనదీ, సుభిక్షమైనదీ మరేదీ ప్రపంచంలో లేదని చెప్పుకునేవారు.

రాజకీయ వ్యవహారాలలో మునిగితేలి, బయటపడినాక ఆయన మనస్సుకు ఆనందం కలిగించటానికి ఎన్నో రకాల వినోదాలు సిద్ధంగా ఉండేవి. ఆయనకు కుటుంబ సంబంధమైన చికాకులు ఏమీ కూడా లేవు. ఆయన భార్య చక్కనిది, పిల్లలు చుక్కల్లాటి వాళ్ళు.

ఆనందసేనుడికి అన్నిటి కన్నా హాస్యోక్తులంటే చాలా ఇష్టం. వినుగు లేకుండా ఎన్ని హాస్యకథలైనా ఆయన విని ఆనందించేవాడు. కాని తరవాత ఎప్పటిలాగా ఆయనను విచారం పట్టుకునేది.

అంతుబట్టని రాజుగారి ఈ విచారం గురించి మంత్రి రాణీ ద్వారా తెలుసుకుని, ఆశ్చర్యపోయాడు. ఎంత ఆలోచించినా రాజుగారి విచారానికి కారణం కనిపించలేదు మంత్రికి. చివరకు ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు: రాజుగారు హాస్య ప్రియుడు; తగినంత హాస్యం అందని కారణం వల్లనే రాజుగారు విచారంగా ఉంటున్నాడు.

ఇలా అనుకుని మంత్రి ఒక ఆస్థాన విదూషకుణ్ణి నియమించటానికి నిర్ణయించాడు. రాణి కూడా ఈ ఆలోచనను ఆమోదించింది. ఆస్థాన విదూషకుణ్ణి నియమిస్తే బాగుంటుందని రాణీ, మంత్రి

"వసుంధర"



గానే ఉండిపోయింది. రాజుగారి విచారం కూడా ఎప్పటిలాగే ఉండిపోయింది.

ఆ దేశంలోనే ఒక గ్రామంలో రామశర్మ అనే బ్రాహ్మడికి ముగ్గురు కొడుకులు ఉండేవారు. ముగ్గురూ చదువుకున్నవారే. అందులో పెద్దవాళ్ళిద్దరూ మంచి మాటకారితనమూ, హాస్యమూగలవాళ్ళు. చతురోక్తులాడటమూ, హాస్యకథలు కల్పించటమూ వాళ్ళకు బాగా తెలుసు. మూడోవాడికి ఈ విద్య అంతగా రాదు గాని, ఎదటివాళ్ళ మనస్సు కనిపెట్టటంలో వాడికి అద్భుతమైన నేర్పూ, చాకచక్యమూ ఉండేవి.

అన్న మీదట, రాజు కూడా అందుకు సమ్మతించాడు. అయితే ఆ విదూషకుణ్ణి రాజుగారే స్వయంగా ఎన్నుకుంటే బాగుంటుందని మంత్రి అన్నాడు. రాజుగారు ఇందుకూ ఒప్పుకున్నాడు.

ఆస్థాన విదూషకుడి నియామకం జరుగుతుందనీ, ఆ పదవికి తగినవాణ్ణి రాజుగారే స్వయంగా ఎన్నిక చేస్తారనీ, దేశమంతటా చాటింపు వేశారు. చాటింపు విని ఎందరో మాటకారులైన హాస్యగాళ్ళు రాజుగారి వద్దకు వచ్చారు. కాని రాజుగారు ఆస్థాన విదూషకుణ్ణి ఎన్నిక చెయ్యటం జరగలేదు. అనేక మాసాలు గడిచాయి, కాని ఆస్థాన విదూషకుడి పదవి ఖాళీ

రాజుగారు వేయించిన చాటింపు ఈ అన్నదమ్ములు విన్నారు గాని, అంత పెద్ద పదవి తమ దాకా రాబోయిందా అనుకుని నిర్లక్ష్యం చేశారు. అయితే, ఎన్ని మాసాలు గడిచినా ఆ పదవికి ఎవరూ ఎన్నిక కాలేదని తెలిసేసరికి, రామశర్మ పెద్దకొడుకు లిద్దరూ తమ అదృష్టం ఎలా ఉన్నదో చూసుకుందామని రాజధానీ నగరానికి ప్రయాణమయారు. వాళ్ళ వెంట మూడో వాడు కూడా బయలుదేరాడు. తమకు పనులు చేసిపెట్టడానికైనా ఉంటాడు లెమ్మని పెద్దవాళ్ళు ఇద్దరూ వాణ్ణి తమ వెంట రానిచ్చారు.

రాజధానీ నగరం చేరుతూనే పెద్ద వాడు రాజును చూడబోయాడు. వాడు రాజును చూసి తిరిగివచ్చి రెండోవాడితో, "నేను చెప్పిన కథలూ, కబుర్లూ విని రాజుగారు విరగబడి నవ్వారు. నాకు ఆయన నూరు వరహాలు బహుమానం యిచ్చి, నన్ను అభినందించారు కూడా. కాని తరవాత ఆయన ఎందుకో విచారంగా కనబడ్డారు. విదూషకుడి పదవికి మాత్రం నన్ను ఆయన ఎన్నిక చెయ్యలేదు. దాన్ని బట్టి నువు ఏం చెయ్యాలో బాగా ఆలోచించుకుని, రేపు రాజుగారి దగ్గిరికి వెళ్ళి నీ అదృష్టం చూసుకో,'' అని చెప్పాడు.

మర్నాడు రెండోవాడు కూడా వెళ్ళి, రాజుగారి దర్శనం చేసుకుని మాట్లాడి, రెండువందల వరహాలు బహుమానంగా పొంది, ఆస్థాన విదూషకుడి పదవికి ఎన్నిక కాకుండానే తిరిగివచ్చాడు.

అన్నదమ్ములు నిరుత్సాహపరిచినా లెక్కచెయ్యకుండా, మూడోనాడు మూడోవాడు రాజును చూడబోయాడు. వాణ్ణి చూస్తూనే రాజు, ''కొత్త విశేషాలేమైనా ఉంటే చెప్పండి,'' అన్నాడు.

అందుకు మూడోవాడు, ''మహారాజా, మీరు ఎన్నోరకాల కథలూ, కబుర్లూ విని ఉంటారు. నేను మీకు విశేషాలు చెప్పగలవాణ్ణి కాను. నేను ఏదో తెలియని విచారంతో బాధపడుతున్నాను. ఈ వంకతో మీతో కాస్సేపు మాట్లాడి, నా దిగులు పోగొట్టుకుందామని వచ్చాను. హాస్యంలో



మిమ్మల్ని మించినవారు లేరని అందరూ చెప్పుకోగా విన్నాను.'' అన్నాడు.

రాజు పక్కనే ఉన్న మంత్రి ఈ మాటలకు చిరాకుపడి, ''రోలు వెళ్ళి మద్దెలతో మొరపెట్టుకున్నట్టుగా ఉన్నది నీ వ్యవహారం,'' అన్నాడు.

రాజు మంత్రిని వారించి, తననూ, ఆ యువకుణ్ణీ కొంతసేపు ఏకాంతంగా వదలమన్నాడు. తరవాత రాజూ, మూడోవాడూ రెండు గంటలసేపు మాట్లాడుకున్నారు.

తరవాత రాజు మంత్రిని పిలిచి, తనకు విదూషకుడితో పనిలేదనీ, రామశర్మ మూడో కొడుకును తన అంతరంగికుడుగా నియమిస్తున్నాననీ చెప్పాడు.

ఈ సంగతి మూడోవాడి నుంచి అన్నలు విని ఎంతగానో ఆశ్చర్యపడి, అందులో గల రహస్య మేమిటో వివరించమని తమ్ముణ్ణి అడిగారు.

''రాజుగారికి తన చతుర సంభాషణతోనూ, హాస్యంతోనూ ఇతరులను సంతోషపెట్టి, గొప్ప హాస్యగాడుగా గుర్తించబడాలని తీవ్రమైన కోరిక ఉన్నది. కాని, ఆయనను సమీపించిన ప్రతివాడూ తన హాస్యంతో రాజుగారిని ఆనందింపజేశాడే గాని, అలా చేసే అవకాశం రాజుగారికి ఇచ్చాడుకాడు. అదే ఆయన విచారానికి అసలు కారణం. ఆయనకు తన హాస్యశక్తిలోనే నమ్మకం తగ్గసాగింది. అందుకనే హాస్యం విన్న తరవాత ఆయనకు మరింత విచారం కలుగుతున్నది. నేను ఈ సంగతి అనుమానించి, ఆయన నాతో హాస్య సంభాషణలు చెయ్యటానికి మంచి అవకాశం ఇచ్చాను. ఫలితం మీరే చూశారు,'' అన్నాడు మూడోవాడు.

రామశర్మ మూడో కొడుకును తన అంతరంగికుడుగా నియమించిన తరవాత రాజుగారిలో మరెన్నడూ విచారం కనపడలేదు. త్వరలోనే మూడోవాడు ఆస్థానంలో తన పదవికి తగ్గట్టు బలం పెంచుకుని, తన అన్న లిద్దరికీ కూడా మంచి పదవులు ఇప్పించాడు.





# పారినయుక్తి

ఒక ఊళ్ళో వీరయ్యా, కోటయ్యా అనే ఇద్దరు స్నేహితులు ఉండేవాళ్లు. ఒకసారి వీరయ్య నాలుగు రోజులపాటు గ్రామాంతరం వెళ్ళవలిసి వచ్చింది. అందుచేత అతను తన పాడి ఆవును కోటయ్య ఇంటికి తోలుకుపోయి, "కోటయ్యా, నాలుగు రోజులపాటు నేను తప్పనిసరిగా పొరుగూరు వెళ్ళవలిసి వచ్చింది. ఈ నాలుగు రోజులూ నా ఆవును కాస్త కనిపెట్టి ఉండు, నీకు పుణ్యం ఉంటుంది," అన్నాడు.

"ఈ భాగ్యానికేనా? మా ఆవుతో బాటే ఇది కూడా మా దొడ్లో ఉంటుందిలే," అన్నాడు కోటయ్య.

వీరయ్య నిశ్చింతగా వెళ్ళిపోయాడు.

తరవాత కోటయ్య రెండు ఆవులకూ సరిపడే మేత వాటి ముందు పడేసి, తన పని మీద తాను ఉండిపోయాడు. తిండి పుష్టిగల వీరయ్య ఆవు గబగబా గడ్డిలో మూడువంతులు తినేసి కోటయ్య ఆవుకు చాలకుండా చేసింది.

అందుచేత కోటయ్యా తన ఆవును పాలు పితకడానికి ప్రయత్నించేసరికి అది తన్నింది. కాని వీరయ్య ఆవు మాత్రం తన ఆవు మామూలుగా ఇచ్చే పాలకు రెట్టింపు పాలు ఇచ్చింది. ఇది చూడగానే కోటయ్యకు ఆ ఆవును సొంతం చేసుకోవాలన్న దుర్బుద్ధి పుట్టింది.

ఆ రాత్రే అతను వీరయ్య ఆవును, రెండు మైళ్ళ దూరాన ఉన్న తన బంధువుల ఇంట ఉంచి వచ్చేశాడు. కొంత కాలం దాన్ని బంధువుల ఇంటనే ఉంచి, తరవాత తీసుకొచ్చి, సంతలో కొన్నట్టు చెప్పదామని అతని ఉద్దేశం.

వీరయ్య పొరుగూరు నుంచి తిరిగి వస్తూనే కోటయ్య ఇంటికి వెళ్ళాడు.

అరుణా శ్రీనివాస్

ఈ నాలుగు రోజులూ అతని ప్రాణాలన్నీ తన ఆవు మీదే ఉన్నాయి. అతను కోటయ్య వేసిన కుర్చీలో కూర్చుంటూనే, "నీ మేలు మరిచిపోలేను, కోటయ్యా. నా ఆవును భద్రంగా చూశావు గదా?" అన్నాడు.

కోటయ్య ముఖం విచారంగా పెట్టి, "ఏం చెప్పమంటావు, వీరయ్యా! చెప్పాలంటే నోరు రావటంలేదు. నీ ఆవు మొన్నటిదాకా బుద్ధిగానే ఉన్నది. దానికి మేత వేశాను, నీళ్ళు పోశాను. పాలు తియ్యబోతే మటుకు దగ్గిరికి రానియ్యలేదు. పోనీ అని ఊరుకున్నాను. నిన్న పొద్దున చూతునుకదా ఆవు లేదు. కట్టు తాడు తెగి ఉన్నది. ఏ రాత్రివేళో తెంచుకుని, ఎక్కడికో పారిపోయి ఉంటుంది," అన్నాడు.

కోటయ్య అబద్ధం చెప్పాడని వీరయ్య గ్రహించాడు, కాని పైకి, "పోనీలే, కోటయ్యా! ఏం చేస్తాం? అలవాటు లేని చోటుకదూ? అందుకే అది అలా చేసి ఉంటుంది. మరి నే వస్తా," అని, తన ఇంటికి వెళ్ళిపోయాడు.

వీరయ్యకు ఇప్పుడు ఒక పెద్ద సమస్య వచ్చింది. తన ఆవును తాను తిరిగి సంపాదించాలి; కాని కోటయ్య దొంగ అన్నది బయటపెట్టి, అతని మనసును బాధించకూడదు. అందుకని అతను తెలివిగల తన స్నేహితుణ్ణి ఒకణ్ణి సలహా అడిగాడు. ఆ స్నేహితుడు బాగా ఆలోచించి



ఒక యుక్తి చెప్పాడు. వీరయ్య దాన్ని అమలుచేశాడు.

ఆదివారం నాటి రాత్రి ఇద్దరు ముసుగు మనుషులువచ్చి కోటయ్య తలుపుతట్టారు. వాళ్ళు వీరయ్య స్నేహితుడు ఏర్పాటు చేసిన మనుషులే.

అర్ధరాత్రి వచ్చిన ఆ మనుషులను చూసి కోటయ్య భయపడ్డాడు.

"సిద్ధంగా ఉందా? వెంటనే ఇచ్చెయ్యి. వెళ్ళిపోవాలి!'' అన్నారు వాళ్ళు కోటయ్యతో.

వాళ్ళు దొంగలని నిర్ధారణ చేసుకుని, ప్రాణాలు బిగబట్టుకుని, కోటయ్య తాను దాచుకున్న డబ్బు మూట తెచ్చి వాళ్ళ ముందు పెట్టాడు.

''ఇది కాదు. పేడ పెట్టె తీసుకురా!" అన్నారు వాళ్ళు.

''పేడ పెట్టె ఏమిటి?'' అని కోటయ్య అడిగాడు.

''నీకు తెలీదా? వీరయ్య ఆవు వేసిన పేడ ఒక పెట్టెలోవేసి ఒక రోజల్లా ఉంచితే అది బంగారమవుతుంది. ఆ పెట్టె ఇలా ఇయ్యి.'' అన్నారు ముసుగు మనుషులు.

వెంటనే కోటయ్య, ''బాబూ, ఇప్పుడు నా దగ్గిర లేదు. రేపు రాత్రి తప్పకుండా ఇస్తాను,'' అన్నాడు.

''మాట తప్పావో, జాగ్రత్త. నీ పని చూస్తాం!'' అని వాళ్ళు కోటయ్యను బెదిరించి వెళ్ళిపోయారు.



కోటయ్యా, బ్రతుకుజీవుడా అని, తలుపు వేసుకున్నాడు.

అతను తెల్లవారక ముందే బంధువుల ఇంటికి వెళ్ళి, వీరయ్య ఆవును తెచ్చి, వెనక గదిలో దాచి ఉంచాడు. దానికి మేతా, నీరూ పెట్టి, అది ఎప్పుడు పేడ వేస్తుందా అని కాచుకు కూర్చున్నాడు. అది పేడ వెయ్యగానే దాన్ని భద్రంగా ఒక పెట్టెలో పెట్టి, మూతవేశాడు.

ఆ రాత్రి ఆ ఇద్దరు మనుషులూ వచ్చి పెట్టె తీసుకున్నారు.

"వీరయ్య మీకు ప్రతిరోజూ ఇలానే ఇస్తాడా?" అని కోటయ్య వాళ్ళను అడిగాడు.

"లేదు. ప్రతి ఆదివారం రాత్రి ఇస్తాడు." అని వాళ్లు వెళ్ళిపోయారు.

వీరయ్య ఆవు వేసే పేడతో తన అదృష్టం పండిందని కోటయ్య ఉప్పొంగిపోయాడు.

కాని మర్నాడు తెల్లవారుతూనే వీరయ్య కోటయ్య ఇంటికి వచ్చి, కబుర్లు చెబుతూ, కూర్చున్నాడు. వీరయ్య వెళ్ళగానే కోటయ్య ఆవుకు మేత వేద్దామని చూస్తున్నాడు. కాని వీరయ్య వెళ్ళే ధోరణిలో లేదు.

ఆవుకు మేత సమయం మించిపోవడంతో అది అరవసాగింది. వీరయ్య చివాల్న లేచి, "కోటయ్యా, అదుగో నా ఆవు! వచ్చేసింది!" అంటూ కోటయ్య ఇంట్లో నుంచి బయటికి వచ్చేశాడు.

ఇదే సమయమని, కోటయ్య లోపలికి వెళ్ళి, వెనక గది తలుపు తెరిచి, వీరయ్య ఆవును పెరట్లోకి తోలేశాడు.

"కోటయ్యా, నా ఆవేనయ్యా!" అంటూ వీరయ్య వీధిలో నుంచి కేక పెట్టాడు.

కోటయ్య బయటికి వచ్చి, రాని నవ్వు నవ్వుతూ, "బంగారంలాటి ఆవు తిరిగి వచ్చింది, అదృష్టవంతుడివి!" అన్నాడు. ఆవు పోయినందుకు దుఃఖంగా ఉన్నా, తన మీద దొంగతనం నేరం పడనందుకు కోటయ్య సంతోషించాడు.





# "మిత్రమా!"

టర్కీ దేశంలో, ఒక కడు పేదవాడు ఉండేవాడు. వాడు ఎంత కటిక దరిద్రుడంటే వాడికి జనం మొహం చూడటానికి కూడా ధైర్యం ఉండేదికాదు. కాని వాడి మనసులో మాత్రం ధనికుల కోరికలన్నీ ఉండేవి. వాటిని గురించి వాడు కలలు కనేవాడు.

ఒకనాడు వాడు ఒక కాఫీదుకాణంలో ఒక మూల కూర్చుని ఉండగా, స్నానశాలకు పోతే ఎంత సుఖంగా ఉంటుందనిపించింది.

వాడు తిన్నగా స్నానశాలకు వెళ్ళి, తన బట్టలు విప్పేశాడు. స్నానశాలలో తనతోబాటు మరొక వ్యక్తి కూడా ఉన్నట్టు వాడికి తోచింది. స్నానశాల మనుషులు క్షణక్షణమూ ఆ మనిషికి షర్బతులూ, ఇతర పానీయాలూ తెచ్చి ఇస్తూ, సేవలుచేస్తున్నారు.

పేదవాడు లోపలికి తొంగిచూసి, ఆ మనిషి ముమ్మూర్తులా తనలాగే ఉండటం గమనించాడు. ఆ మనిషి స్థానం తాను ఆక్రమించాలన్న ఆలోచన వచ్చి, నౌకర్లు ఎవరూలేని సమయంలో పేదవాడు లోపలికి వెళ్ళి, ఆ మనిషి కట్టుకున్న తువాలు లాగేసి, ఆ మనిషిని నీళ్ళ తొట్టిలో పడేసి, ఆ తువాలు తాను చుట్టుకుని, ఆ మనిషి స్థానంలో కూర్చున్నాడు.

ఇంతలో తిరిగి వచ్చిన స్నానశాల మనుషులు పేదవాడికి సమస్త మర్యాదలతో స్నానం చేయించి, మేలు రకం అంగీ కప్పి, వెలుపలి గదికి తెచ్చారు. అక్కడ ధనికుడి మనుషులు రకరకాల దుస్తులతో సిద్ధంగా ఉన్నారు. వాళ్ళు చప్పున ముందుకువచ్చి, పేదవాడికి బట్టలు తొడిగి, బరువైన దీనారాల సంచీ చేతికి ఇచ్చారు.

టర్కిష్ జానపద కథ

పేదవాడు దుస్తులు ధరించటం పూర్తి చేసి, సంచీ నుంచి మూడు దీనారాలు తీసి, స్నానశాల మనుషులకు ముగ్గురికీ తలా ఒకటీ ఇచ్చాడు. స్నానశాలవాళ్ళు సగౌరవంగా అతని వెంట బయటికి వచ్చారు.

బయట పేదవాడి కోసం గుర్రం ఒకటి సిద్ధంగా ఉన్నది. నౌకర్లు వాణ్ణి గుర్రం ఎక్కమన్నారు. పేదవాడికి కంపరం పుట్టింది. కాని గుర్రం మీద ఎక్కనంటే నిజం బయటపడి పోతుందని, వాడు దానిమీద ఎక్కి, దాని యిష్టప్రకారం పోనిచ్చాడు.

గుర్రం వెళ్ళి ఒక దివ్యమైన ఇంటి ముందు ఆగింది. నౌకర్లు పరిగెత్తుకుంటూ వచ్చి తలుపులు తెరిచారు. వాళ్ళ సహాయంతో వాడు గుర్రం దిగి, లోపలికి వెళ్ళి, దిగ్భ్రమతో లోపల అంతా కలయజూశాడు.

"తమరు తమ గదికి వెళతారా? అంతఃపురానికి వెళతారా?" అని వాణ్ణి నౌకర్లు అడిగారు.

"నా గదికే పోతాను," అన్నాడు పేదవాడు.

మరి కొంచెంసేపటికి నౌకర్లు వచ్చి, "భోజనం తమ గదిలో చేస్తామంటారా, లేక అంతఃపురంలో చేస్తారా?" అని అడిగారు.

"ఇక్కడికే తీసుకురండి," అన్నాడు పేదవాడు.



భోజనం అయిన కొంతసేపటికి ఒక నౌకరు వచ్చి, "వేళ మించిపోయింది. తమరు అంతఃపురానికి వెళతారా?" అని అడిగాడు.

"ఇప్పుడే వెళుతున్నాను," అన్నాడు పేదవాడు.

నౌకరు సలాంచేసి వెళ్ళిపోయాడు.

అయితే పేదవాడికి ఎటుపోవాలో తెలీక కంగారు పుట్టుకొచ్చింది. వాడు అనేక ద్వారాలు తెరిచి చూసినమీదట, అంత:పురంలో ఆడవాళ్లుండే గది తలుపు దొరికింది.

ఆ ఇంటి యజమానురాలు చాలా చక్కనిది. వాడు రావటం చూడగానే ఆమె లేచి ఎదురువచ్చింది. ఆమెను చూడగానే పేదవాడు కొయ్యబారిపోయి కాలు కదిలించలేక పోయాడు. ఆమె వాణ్ణి తీసుకుపోయి, తన సరసనే కూర్చోబెట్టుకుని సంభాషణ మొదలు పెట్టింది. వాడికి భయంతో గుండె గుబగుబ లాడుతున్నది.

"చూడండి! మొన్న ఒక స్నేహితురాలు మన ఇంటికి వచ్చినప్పుడు మీపేరు అడిగింది. నమ్ముతారో, నమ్మరో! నాకు చచ్చినా మీ పేరు జ్ఞాపకం రాలేదు. ఇప్పటికీ నాకు మీ పేరు గుర్తు రావటం లేదు. మరేమీ అనుకోక, కాస్త చెబుదురూ!" అన్నదామె.

పేదవాడికి చాలా పెద్ద చిక్కే వచ్చింది.



'' ఇంతకాలం మనం కాపరం చేశాం గదా, నా పేరు ఎలా మరిచిపోయావు ?'' అన్నాడు వాడు.

వాడు తన పేరు చెప్పితీరాలని అమె పట్టుపట్టింది. వాడు తోచిన పేర్లన్నీ చెప్పాడు. వాడు అబద్ధమాడుతున్నట్టు బయటపడింది. ఆ స్థితిలో వాడు తాను చేసిన పాడుపని విధిగా బయటపెట్టవలసి వచ్చింది.

'' నన్ను క్షమించండి!'' అని వాడు అమెను ప్రాధేయపడ్డాడు.

'' సరే, నిన్ను క్షమిస్తాను. కాని నా భర్త రాజుగారి ప్రధాన కథకుడు; అతని కోసం ఏ క్షణాన అయినా కబురు రావచ్చు. అప్పుడు ఏం చేస్తావు ?'' అన్నదామె.

ఆమె మాట పూర్తికాకముందే, రాజు గారి నుంచి పిలుపు వచ్చింది.

పేదవాడు వణికిపోతూ ఆమె కేసి తిరిగి, '' ఇప్పుడు నేనేం చెయ్యాలి ?'' అని అడిగాడు.

ఆమె ఇలా చెప్పింది: '' రాజుగారి ముందు రెండు ఆసనాలు ఉంటాయి. ఒకదానిమీద ముత్యాల దండ ఉంటుంది. రెండోదాని మీద బంగారు దండ ఉంటుంది. నువు ముత్యాలదండ మెడలో వేసుకుని, బంగారు దండ చేత పుచ్చు కుని, రాజుగారిని 'మిత్రమా!' అని సంబోధించి కథ చెప్పాలి.''

రాజు పంపిన మనుషుల వెంట వాహ నంలో పేదవాడు రాజభవనానికి వెళ్లాడు. రాజభవనం చూస్తూంటేనే వాడికి ముచ్చె మటలు పోశాయి. రాజుగారి సమక్షంలోకి వెళ్ళాక, చేసేదిలేదు గనక, ముత్యాల దండ మెడలో వేసుకుని, బంగారు దండ చేత పట్టుకుని వాడు, "మిత్రమా!" అన్నాడు.

ఇంతలో వాడికి మెలకువ వచ్చి, జరిగినదంతా కల అని తెలుసుకున్నాడు. వాడు కాఫీదుకాణం మూలనే ఉన్నాడు. తన చింకిబట్టలు చూసుకుని వాడు పొందిన ఆనందం ఇంతా అంతా కాదు!






రావణుడు అలా అన్న మీదట సీత భయంతో వణుకుతూ, ఏడుపు గొంతుతో, ఒక గడ్డిపోచను చేత బట్టుకుని, దానితో ఇలా అన్నది :

"నువు నన్ను గురించి ఆలోచించకు. పాపికి ఉత్తమలోకం ఎంత అసాధ్యమో, నేను నీకు అంత అసాధ్యమైన దాన్ని. నేను గొప్పకులంలో పుట్టిన పుణ్యాత్మురాలిని. తప్పుడు పనులు చేసే దాన్ని కాను. పతివ్రతను. నేను పరపురుషుడి భార్యను. నీ భార్యలు ఎలా ఉండాలని కోరుకుంటావో ఇతరుల భార్యలూ అలాగే ఉండాలనుకో. నీకు బుద్ధి చెప్పేవారు లేక ఇలాటి బుద్ధులు అవలంబించావు. లేదా, వినాశకాలం వచ్చి, వాళ్ళమాటలు నువు వినటం లేదో! నీ మూలాన ఈ లంక త్వరలో నాశనం అవుతుంది. అప్పుడు ప్రజలందరూ సంతోషిస్తారు. నాకు నీ అంతఃపురమూ, అధికారాలూ, సంపదా అవసరం లేదు. నేను రాముడికి మాత్రమే తగిన భార్యను. క్షేమంగా ఉండగోరితే ఆ రాముడితో మైత్రి చేసుకో. అతను ఉదారుడు గనక నీ తప్పు క్షమించి వదిలిపెడతాడు. నేను కూడా నీ పక్షాన మాట్లాడతాను. చిత్తశుద్ధితో నన్ను రాముడికి తిరిగి ఇచ్చెయ్యి. జనస్థానంలో రాముడు నీ వాళ్లనందరినీ చంపటం చూసి, దొంగతనంగా నన్ను తీసుకు వచ్చిన పిరికివాడివి, అధముడివి! నిన్ను రామలక్ష్మణులు అవలీలగా చంపగలరు."

## 13. త్రిజట కలలు



ఈ మాటలకు రావణుడికి చాలా కోపం వచ్చింది. అతను సీతతో ఇలా అన్నాడు :

''సీతా, నువు అన్న ప్రతి మాటకూ నేను నిన్ను చంపవచ్చు. కాని నీ మీద గల మోహం నా కోపాన్ని అణచిపెట్టు తున్నది. నేను నీ కిచ్చిన గడువులో ఇంకా రెండుమాసాలు మిగిలిఉన్నాయి. ఆ తరవాత నువు నా భార్య వవుతావు. అందుకు ఒప్పుకోకపోతే నిన్ను చంపి, వండించుకుని తినేస్తాను.''

రావణుడు ఇలా క్రూరంగా సీతతో మాట్లాడి నందుకు అతని వెంట ఉన్న రాక్షసస్త్రీలు కొందరు నొచ్చుకుని, తమ కళ్ళతో సీత పట్ల సానుభూతి చూపారు. రావణుడు అక్కడవున్న భయంకరా కారాలుగల రాక్షసస్త్రీలతో, ''ఈ సీత మనసు నా మీదకు మళ్ళేటట్టు చెయ్యండి. సామదాన భేద దండోపాయాలన్నీ ప్రయో గించి చూడండి,'' అన్నాడు.

అప్పుడు రావణుడి భార్యలందరిలోకీ చిన్నదైన ధాన్యమాలిని అనే రాక్షసస్త్రీ రావణుణ్ణి కౌగలించుకుని, ''నీకు నేనున్నాను గదా? రాక్షసరాజువైన నీకు ఈ మనుష్య స్త్రీ దేనికి? నీకు భార్య అయే గీత ఈవిడకు బ్రహ్మదేవుడు రాసిపెట్ట లేదు. అందుకే నిన్ను నిరాకరిస్తున్నది. ఇష్టంలేని మనిషిని కోరి ఏం ప్రయోజనం? నీ కోసం పడిచచ్చేదాన్ని నేనున్నాను గద!'' అన్నది.

రావణుడు ధాన్యమాలిని మాటలకు నవ్వుతూ ఆమెను విడిపించుకుని, వెనక్కు తిరిగి, తన యింటికి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళగానే రాక్షస స్త్రీలు సీత చుట్టూ చేరి, ఆమెను నిందించారు. వారిలో ఏకజటా, హరిజటా, ప్రఘసా, వికటా, దుర్ముఖి అనేవాళ్ళున్నారు. రావణుడు ఎంత గొప్పవాడో, అతనికి భార్యకావటం ఎంత గొప్పవిషయమో, సీత అతన్ని నిరాకరించటం ఎంత బుద్ధి తక్కువో వివరించి చెప్పారు.

సీత వాళ్ళతో, "ఇలా మాట్లాడటం పాపమని మీకు తెలీదా? మీరందరూ కలిసి నన్ను పీక్కుతిన్నా నాకు సమ్మతమే గాని, నేను రావణుడికి భార్యను మాత్రం కాను," అన్నది.

అప్పుడు రాకసస్త్రీలు సీతను భయపెట్టసాగారు. వాళ్ళు అనే మాటలన్నీ చెట్టు మీద ఉన్న హనుమంతుడు వింటూనే ఉన్నాడు. సీత రాకసస్త్రీలతో సహా వచ్చి, హనుమంతుడు ఎక్కి ఉన్న శింశుపా వృక్షం కిందనే కూర్చున్నది.

అప్పుడు వినత అనే రాకసి సీతతో, "నువు చాలా గుణవంతురాలివి. పతివ్రతవు. అది ఎంతో మెచ్చుకోదగిన సంగతి. కాని దేనికైనా ఒక మితి ఉండాలి. రావణుడు అందగాడూ, పరాక్రమవంతుడూ, రాకసులకు రాజూనూ. అతనికి భార్యవై చక్కగా అలంకరించుకో, సుఖపడు. రాముడు దుఃఖజీవి. రావణుడితో శత్రుత్వం పెట్టుకుని బతకలేడు. అతని మీద ఆశ వదులుకో," అన్నది.

"మేమంతా నీ మేలుకోరే చెబుతున్నాం. మా మాటలు ఎందుకు వినవు? నీ యౌవనం శాశ్వతమనుకుంటున్నావా? నిన్ను చంపేసి తినేస్తాం!" అన్నారు రాకసస్త్రీలు.



"ముందు సీతను చంపి తరవాత, రావణుడితో సీత చచ్చిందని చెబుదాం. రావణుడు, అలా అయితే తినెయ్యండి, అంటాడు. ఈవిడ మాంసాన్ని అందరికీ సమానంగా పంచండి. లేకపోతే తరవాత కీచులాడుకోవలిసివస్తుంది," అని రాకసస్త్రీలు తమలో తాము మాట్లాడుకున్నారు.

వాళ్ళ మాటలు వింటూ సీత అమితంగా దుఃఖించింది; రామలక్ష్మణులనూ, కౌసల్యా, సుమిత్రలనూ తలచుకుని ఏడ్చింది; తనకు చావు రానందుకు విచారించింది.

అంతవరకూ పడుకుని ఉండిన త్రిజట అనే ముసలి రాకసి మిగిలిన రాకస



స్త్రీలతో, "మీరంతా ఆ సీతను ఏం తింటారు? నన్ను తినండి. నాకు ఒక భయంకరమైన కల వచ్చింది. రాక్షసులకు నాశమూ, రాముడికి జయమూ కలుగుతాయట," అన్నది.

"ఏమిటా కల?" అని రాక్షసస్త్రీలు త్రిజటను అడిగారు.

తూర్పు తెల్లవారుతూండగా త్రిజట తన కలను వాళ్ళకు ఈ విధంగా చెప్పింది: "రాముడు తెల్లని పూలదండలూ, తెల్లని బట్టలూ కట్టుకుని, లక్ష్మణుడితో సహా, ఆకాశమార్గాన ఒక పల్లకీ ఎక్కి లంకకు వచ్చాడు. దాన్ని వెయ్యి హంసలు తెచ్చాయి. ఈ సీత తెల్లని బట్టలు ధరించి, సముద్ర మధ్యంలో శ్వేతపర్వతం మీద నిలబడి ఉన్నది. ఆమె రాముణ్ణి చేరుకున్నది. తరవాత రాముడు లక్ష్మణుడితో సహా కొండంత ఏనుగు మీద ఎక్కి లంకలో తిరగటం చూశాను. తరవాత సీతా రామ లక్ష్మణులు ఏనుగు మీద లంకకు పైగా కనిపించారు. చివరకు రాముడు సీతనూ, లక్ష్మణుణ్ణీ తీసుకుని పుష్పకవిమానం మీద ఉత్తరంగా వెళ్లటం కనిపించింది. రావణుడు గన్నేరు పూల మాలలు ధరించి, ఒళ్ళంతా నూనె పూసుకుని, నూనె తాగుతూ కైపెక్కి, నేలమీద పడినట్టు చూశాను. ఇంకోసారి రావణుడు పుష్పకం నుంచి కిందపడ్డట్టూ, నెత్తిమీద వెంట్రుకలు లేనట్టూ, నల్ల బట్టలు కట్టుకున్నట్టూ, ఎవరో ఆడది అతన్ని ఈడ్చుకు పోతున్నట్టూ చూశాను. రావణుడు గాడిదనెక్కి దక్షిణంగా పోవటం కూడా చూశాను. ఇంకోసారి అతను భయపడి, గాడిద మీది నుంచి తలకిందులుగా పడడం కనిపించింది. ఒక స్త్రీ ఎర్రనిబట్టలు కట్టుకుని, ఒళ్లంతా బురద పూసుకుని, రావణుడి మెడకు తాడు కట్టి దక్షిణంగా ఈడ్చుకుపోయింది. కుంభకర్ణుడు కూడా ఇలాగే కనిపించాడు. రావణుడి కొడుకులందరూ నూనెతో అభిషేకాలు చేసుకున్నట్టు కనబడ్డారు.



రావణుడు పందినీ, ఇంద్రజిత్తు మొసలినీ, కుంభకర్ణుడు ఒంటెనూ ఎక్కి దక్షిణంగా పోవటం కనిపించింది. ఒక్క విభీషణుడు మాత్రం తెల్ల పూలమాలలూ, తెల్ల బట్టలూ, ఒంటికి తెల్ల గంధమూ ధరించి, తన నలుగురు మంత్రులతో సహా నాలుగు దంతాలుగల పెద్ద ఏనుగు మీద కూర్చుని కనిపించాడు. లంకానగరం విరిగి సముద్రంలో పడటం కనిపించింది."

ఇలా చాలాసేపు తనకు వచ్చిన కలలో విశేషాలు రాక్షసస్త్రీలకు చెప్పి, త్రిజట, ''మీరు దూరంగా ఉండండి. రాముడికి సీత దొరికిందే అనుకోండి. సీతతో చెప్పేదేదో మంచిగానే చెప్పండి. మనం సీత నుంచి అభయం కోరటం మంచిదనుకుంటున్నాను.'' అన్నది.

చెట్టు మీది నుంచి అంతా చూస్తూ, అంతా వింటున్న హనుమంతుడికి సీతను ఎలా ఓదార్చాలో తెలియలేదు. ఆమెతో మాట్లాడకుండా తిరిగి వెళ్ళటం అర్థంలేనిపని. రాక్షసస్త్రీలకు అనుమానం కలిగించి, రాక్షసవీరులతో యుద్ధం తెచ్చుకోవటం అవివేకం! యుద్ధంలో జయమే కలుగుతుందని చెప్పటానికి లేదు; ఒకవేళ తాను రాక్షసులను చంపినా, తిరిగి సముద్రాన్ని దాటేశక్తి మిగలకపోవచ్చు. సీత తనను మాయా రూపంలో ఉన్న రాక్షసుడని భయపడకుండా చూడాలి.

అన్నివిధాలా ఆలోచించి, హనుమంతుడు యిలా ఒక కథ, సీతకు వినిపించేలాగా, చెప్పాడు:

''దశరథుడు అనే గొప్ప రాజుకు రాముడు అనే పెద్దకొడుకు ఉండేవాడు. ఆ రాముడు తండ్రి ఆజ్ఞచేత భార్యనూ, తమ్ముణ్ణీ వెంట బెట్టుకుని అరణ్యానికి వెళ్ళాడు. అరణ్యంలో ఆ రాముడు శూరులైన రాక్షసులను అనేక మందిని చంపాడు. జనస్థానంలో అనేక మంది రాక్షసులు రాముడి చేతిలో చచ్చారని విని, రావణుడు మాయలేడి ద్వారా

మోసంచేసి, సీతను ఎత్తుకు పోయాడు. రాముడు తన భార్యకోసం అరణ్యాలలో వెతుకుతూపోగా, సుగ్రీవుడు అనే వానరుడితో స్నేహం కుదిరింది. రాముడు వాలి అనే వానరరాజును చంపి, సుగ్రీవుడికి వానరరాజ్యం ఇప్పించాడు. సుగ్రీవుడు అజ్ఞాపించగా, అనేకవేల వానరులు సీతాదేవిని వెతకటానికి అన్నిదిక్కులకూ బయలుదేరారు. వారిలో ఒకడినైన నేను నూరు యోజనాల సముద్రాన్ని దాటి వచ్చాను. రాముడు వర్ణించినట్టుగానే ఉన్న సీతను చూశాను.''



ఇంతవరకు చెప్పి హనుమంతుడు ఆగాడు. అతని మాటలను పూర్తిగా విన్న సీత నిర్ఘాంతపోయి, తల ఎత్తి చెట్టులోకి చూసింది. ఎంతో శ్రమపడి అంతటా కలయ జూసినమీదట ఆమెకు హనుమంతుడు కనిపించాడు.

తెల్లని బట్ట కట్టుకుని చెట్టు కొమ్మల మధ్య మెరుపులాగా కనిపించిన హనుమంతుణ్ణి చూడగానే సీతకు కాస్తభయం పుట్టింది. ఆపదలో కనిపించే కోతిరూపం తనకు కనిపించిందని ఆమె చాలా దుఃఖించింది. రాకసస్త్రీలు విని పోతారని ఆమె నిశ్శబ్దంగా ఏడ్చింది. లంకలో రాముడి కథ చెప్పేవాళ్ళుండటం అసంభవం కాబట్టి, తాను కలగంటున్నానని ఆమె అనుకున్నది. కలలో కోతి కనిపించటం చాలా చెడ్డది; రాముడికి ఏం ఆపదవస్తుందో అని భయపడింది. అయితే తనకు నిద్రేలేనప్పుడు కల ఎలా వస్తుంది? తాను అస్తమానమూ రాముణ్ణి గురించే ఆలోచించటంవల్ల తనకు రాముడి విషయం విన్నట్టు భ్రమకలిగి ఉంటుందని ఆమె అనుకున్నది. ఏమైనా తాను విన్న మాటలు నిజంకావాలని ఇంద్రుడికీ, బృహస్పతికీ, బ్రహ్మకూ, అగ్నిహోత్రుడికీ మనసులోనే దణ్ణాలు పెట్టుకున్నది.

ఈలోపల హనుమంతుడు చెట్టు మీది నుంచి నేల మీదికి దూకి, సీతను సమీ

పించి, చేతులు జోడించి నమస్కారం చేసి, "అమ్మా, పతివ్రత లాగా కనిపిస్తు న్నావు. నువ్వెవరు? ఎందుకు కంటనీరు కార్చుతున్నావు? నిన్ను చూస్తే ఏ దేవ గణానికో చెందిన దానివి అనిపిస్తున్నది. నీ కొడుకూ, తండ్రీ, సోదరుడూ, భర్తా ఎవరు? ఒకవేళ నువు రావణుడి చేత జనస్థానం నుంచి అపహరించి తేబడిన సీతవే అయితే ఆ సంగతి వెంటనే చెప్పు. నీకు అన్నివిధాలా శుభం కలుగుతుంది." అన్నాడు.

దానికి సీత హనుమంతుడితో ఇలా అన్నది:

"నేను దశరథమహారాజు కోడలిని. విదేహరాజైన జనకుడి కూతురిని. నా పేరు సీత. రాముడి ఇంట పన్నెండేళ్ళు సమస్త సుఖాలూ అనుభవించాను. పదమూడో ఏట రాముడికి పట్టాభిషేకప్రయత్నాలు జరుగుతూండగా, దశరథుడి భార్యలలో కైకేయి అనే ఆమె, రామ పట్టాభిషేకం జరిగితే తాను నీరూ, ఆహారమూ విసర్జించి చచ్చిపోతాననీ, రాముణ్ణి అరణ్యానికి పంపమనీ అన్నది. లోగడ కైకేయికి వరాలు వాగ్దానంచేసి ఉన్న దశరథుడు అసత్యానికి పాల్పడలేక, రాముడికి ఇస్తా నన్న రాజ్యాన్ని తిరిగి రాముడి నుంచి తీసుకున్నాడు. రాముడు తండ్రి మాటకు మనస్ఫూర్తిగా సమ్మతించి, నారబట్టలు కట్టుకుని బయలుదేరుతూ, నన్ను కౌసల్య దగ్గిర ఉండమన్నాడు. రాముణ్ణి విడిచి స్వర్గంలో కూడా ఉండలేను. అందుచేత నేను అతని కన్నముందే అరణ్యానికి బయలుదేరాను. అలాగే సుమిత్ర కొడు కైన లక్ష్మణుడు కూడా రాముడితో బాటు బయలుదేరాడు. మేం దండకారణ్యంలో ఉంటూండగా, దుర్మార్గుడైన రావణుడు నన్ను ఇక్కడికి తెచ్చాడు. రావణుడు నన్ను ఇంక రెండు మాసాలపాటు ప్రాణాలతో ఉండనిస్తానన్నాడు. తరవాత నేను చచ్చిపోతాను."

ఈ మాటలు విన్న హనుమంతుడు విచారంతో సీతను ఇలా ఓదార్చాడు:






వలిభిర్ముఖ మాక్రాంతం,
పలితై రంకితం శిరః,
గాత్రాణి శిథిలాయంతే,
తృష్ణైకా తరుణాయతే. 1

[ముఖమంతా ముడతలు పడింది. తల అంతా నెరిసింది. అంగాలు పట్టు తప్పుతున్నాయి. ఆశ మాత్రం యౌవనంలో ఉన్నది.]

భ్రాంతం దేశ మనేక దుర్గవిషమం
ప్రాప్తం న కించిత్ఫలం,
త్యక్త్వా జాతికులాభిమాన ముచితం
సేవా కృతా నిష్ఫలా,
భుక్తం మానవివర్జితం పరగృహే
ష్వాశంకయా కాకవత్.
తృష్ణే! జృంభసి పాపకర్మపిశునే
నాద్యాపి సంతుష్యసి. 2

[తిరగటానికి సాధ్యం కాని దేశమంతా తిరిగాను, కాని కొంచెం కూడా ఫలితం లేక పోయింది. ఉచితమైన జాతి కులాభిమానాలను వదిలేసి కొలువుచేసి కూడా లాభం కలగ లేదు. సిగ్గువిడిచి కాకి లాగా ఇతర గృహాలలో తిన్నాను. అయినా, పాపిష్ఠి ఆశా, నువు పెరుగుతూనే ఉన్నావు గాని ఉపశమించవు!]

ఆశ

Photo by Prafulla Chandra Dhir



మునునూరు.
కృష్ణాజిల్లా

నకలు పులి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు అక్టోబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డుపైనమాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ధనికుల దాహం

మూడవ అట్ట:
దరిద్రుల దాహం


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3. Arcot Road, Madras-600026. Controlling Editor : 'CHAKRAPANI'







NP
CRACKIES
bonbite






NP

